# "రైతు బిడ్డలు"

(నాటకం)




రచన-
కొడాలి గోపాలరావు

రామం పబ్లికేషన్స్
మెయిన్‌రోడ్
తెనాలి.

తొలికూర్పు - ౧౨౦౦

ముద్రణ : "రవి ప్రింటర్స్," తెనాలి.

1953 - అక్టోబరు.

మూల్యం : ఒక రూపాయి



కొడాలి గోపాలరావు

పెదరావూరు P. O.

(తెనాలి తాలూకా)

నిండు హృదయంతో



ప్రియమైన

నాన్న

గారికి

సమర్పణ

కొడాలి గోపాలరావు

తే 28-8-54

# పరిచయం

మిత్రుడు గోపాలరావు వ్రాసిననాటకం "రైతుబిడ్డలు" చదవటంజరిగినది. నేటి మనగ్రామాల్లో రైతాంగంలో ఏర్పడిన అసూయ, ద్వేషాలు ఎలా గ్రామజీవితాన్ని నాశనంచేస్తున్నవో చక్కగా చిత్రించారు. నాటకం చదువుతున్నంతకాలం నాటకంలో పాత్రలుపోలిన మనుష్యులు మనగ్రామాల్లో ఎవరెవరు అనే పరిశీలన గుర్తింపుకురాగలదు. ఇలాంటి చేదుకాయల్ని గుర్తించగలగటమేకాక, గ్రామాలను వీరినుండి కాపాడి అభివృద్ధికర ప్రయోజనాలకొరకు ఉద్యమాలను ప్రోత్సహించేదానికి, ఈనాటం చాల ఉపయోగపడగలదు.

ఇందులో చిత్రించిన పాత్రలస్వభావాలు - మాటలు - చేష్టలు - చర్యలు చక్కగా వున్నవి. గ్రామాల్లో ఈస్థితికిగల మూలకారణాలు వాటి నివారణకుగల మార్గాలు మొత్తంగా గ్రామాల ప్రస్తుతస్థితి తొలగించుకోవాలన్న ఆరాటం ఈ నాటకం చదివాక ప్రతియువకుడిలో గల్గుతుంది. యింతచక్కగా వ్రాయబడిన యీ నాటకాన్ని ప్రదర్శించే సోదరులు చక్కగా పాత్రలను అర్థంచేసుకుని నటించే బాధ్యతతీసుకుంటే చాలా ప్రయోజనాలు కలుగగలవు.

తెనాలి
17-10-53

ఇట్లు భవదీయుడు,
(సం.) రావి అమ్మయ్య

# ప్రస్తావన

పేదరైతు, కూలి, నాటకాలతో విశాలాంధ్ర నాలుగుచెరుగుల లోనూ, నేను ఆంధ్రప్రజలకు చిరపరిచితుడనయ్యాను. ఈరెండు మైలు రాళ్ళూ ఆదర్శ గ్రంథమండలివారు దాటించటానికి చేయూతనిచ్చారు. తరువాత నాటకం 'దరిద్రుడు' త్వరలో వెలుగులోకి రాబోతున్నందుకు సంతోషం.

ఈ "రైతుబిడ్డలు" నాటకం ఆంధ్రప్రజలముందుకు తీసుకెళ్ళాలని చాలా ఆరాటపడ్డాను. అయినా ఆలస్యం జరిగింది.

ఈనాటకం ప్రచురణకర్తలైన రామం పబ్లికేషన్స్‌వారు నాతో పాటు ఆరాటపడ్డారు. కాని తెరవెనుక భాగవతులు కల్పించిన విఘాతం. మాఅందరి ఉత్సాహాన్ని ఛేదించలేకపోయింది. ముఖ్యంగా ఈనాటకాన్ని వెలుగులోకి తెచ్చిన శ్రీ ఆర్. నరసయ్యగారికి సాకృతజ్ఞతాభివందనాలు.

అడిగినంతనే ఈనాటకం చదివి తమ అభిప్రాయమిచ్చిన శ్రీ రావి అమ్మయ్యగారికి, ఈ నాటకానికి ముఖచిత్రం సహృదయంతో సకాలానికి అందించిన శ్రీ గోలి శేషయ్యగారికి, ముద్రణ విషయంలో జరిగిన అఘాతాన్ని పూడ్చివేసి అందంగా అచ్చువేసి సకాలానికి అందించిన శ్రీ "రవి ప్రింటర్స్" వారికి నా అభివందనాలు. ఈ నాలుగవ ప్రయత్నమును విజయవంత మొనరించి నా అభ్యుదయానికి మార్గం ఏర్పరుస్తున్న ఆంధ్రప్రజలకు నా అభివందనాలు.

పెదరావూరు
24-10-53

ఇట్లు భవదీయుడు,
కొడాలి గోపాలరావు

## ఇందులో....

| | | |
|---|---|---|
| నరసయ్య | — | మధ్యరకంరైతు |
| చంద్రం<br>రంగారావు | — | నరసయ్య కొడుకులు |
| సత్యం | — | నరసయ్య అల్లుడు |
| రాఘవయ్య | — | నరసయ్య బంధువు |
| కోటిగాడు | — | నరసయ్య నౌకరు |
| జగన్నాధరావు | — | భూస్వామి |
| కామయ్య | — | చెట్టుక్రిందప్లీడరు |
| భీముడు | — | రౌడీ |

### స్త్రీలు

| | | |
|---|---|---|
| సుశీల | — | నరసయ్య కుమార్తె |
| శ్యామల | — | జగన్నాధరావుకుమార్తె |

స్థలం — ఒకపల్లెటూరు
కాలం — వర్తమానం

# రైతుబిడ్డలు

:- ఒకటవ రంగం :-

[తెర]

[అది నరసయ్యగారి యిల్లు. యింటిముందు వసారా. వసారాలో రెండు మంచాలూ ఒక ముక్కాలి పీట. దక్షిణపు వైపు గోడ ప్రక్కన గెడంచి. దానిమీద నాలుగు వడ్ల బస్తాలు. ఉత్తరపు వైపు గోడమూల వ్యవసాయ పనిముట్లూ, గోడలకు అక్కడక్కడా దేవతల ఫోటోలుంటయి. నరసయ్య చిన్నకొడుకు రంగారావు బయట నుండి వస్తాడు. వయస్సు 23 సంవత్సరాలు, సామాన్యమైన గుడ్డలు, కాస్త లావుగా, అంత లావుకు తగిన ఎత్తుంటాడు వస్తూనే]

రంగా- అమ్మాయ్ ... సుశీ....

సుశీ - (వస్తూనే) దేనికన్నయ్యా? (వయస్సు 16 సంవత్సరాలుంటయి. అంతా రంగారావు పోలికే, సామాన్యమైన గుడ్డలే అయిన అవి కాస్త కొత్తగా వుంటయి)

రంగా- తిండిపెట్టేదేమన్నా వుందా?

సుశీ- (ముఖంచిన్నబుచ్చుకొని) యిప్పుడు పెట్టనన్న దెవరూ? గడపలో కాలు పెట్టావో లేదో అప్పుడే తగాదా?

రంగా— నోరుమూసుకోనిపదా, నాకవతల పనుంది?

సుశీ— వీధులెంట తిరిగేపనేనా?

రంగా— (ఎగతాళిగా) కాదు. విస్తరాకులెత్తేపని.

సుశీ— (బాధగా) అందుకు పనికిరావాలిసిందేమనం,ఒకపనా? పాటా,యదాస్తమానం దిక్కుమాలిన తిరుగుడేకదా; పొలంపని ముట్టేదిలేదుగదా? పోనీ; యింటిదగ్గర గొడ్డూ గోడనన్నా నీవుతావాలంటే అది అసలే లేదు!

రంగా— అయిందా వుపన్యాసం!

సుశీ— నలుగురూ నిన్నుగురించి ఏమనుకుంటున్నారో నువ్వు వింటున్నావా అన్నయ్యా? నువ్వయిలాతిరిగితే నీకు పిల్లనెట్లాయిస్తారు! పెళ్ళెట్లాఅవుతుంది?

రంగా— (హేళనగా) నీకైయిదిగా! చాలే! సంతోషించాం.

సుశీ— (కోపముతో) నువ్వు యిలాతిరిగి ఏమైపోదామనీ?

రంగా— (పరిహాసంగా) మనిషినై పోదామని.

సుశీ— (చికాగ్గా) మా మాట నువ్వెందుకింటావులే నాన్న నీకోసం (మధ్యలో)

రంగా— (నవ్వుతూ) చచ్చేటట్లుగాతిని, నిశ్చింతగా నిద్రపోతు న్నాడుకదూ?

సుశీ— అన్నయ్యా (కోపముతో) నీకు చిన్నా పెద్దా లేకుం డాపోతుంది మరీను.

రంగా— చాల్లే! ఆపుసోది, పద తిండిపెడుదువుగాని (వెటకారంగా) ఈయింటినుద్ధరించటానికి మీరంతా వున్నారుగా? చాల్లే?

సుశీ— మేము ఉద్ధరిస్తామని నీతో చెప్పామా? దరిద్రపు స్నేహాలుపట్టి నువ్వే ఉద్ధరిస్తున్నావుగా! నలుగురిలో ఛీ. ఛీ. అనిపించుకుంటాను.

రంగా— ఎవ్వడు నన్ను ఛీ ఛీ. అంది. వాణ్ణి కొండ్ర పగలదీస్తాను.

సుశీ— నోరుండేసరి నాకెందుకులే? యిన్నేళ్ళు వచ్చినాక నీకు తెలియాలి కాని!

రంగా— నాకు తెలుస్తూనేవుంది, నువ్వు ఈయింటిని ద్ధవ్వరించటానికి పుట్టావని.

సుశీ— యింటికి వస్తూనే అదిరించిబెదిరించి గాంపటం. తినిపోయి, వీధులంట కొంపా గోడీలేనివాడికిమల్లె తిరగటం. ఛీ; ఛీ. పాడుబ్రతుకు (వెళ్ళబోయింది)

రంగా— ఏమన్నావ్ (కొట్టబోతాడు. సుశీల ఏడుస్తూ విడిపించుకొంటుంది) జాగ్రత్త! పద, తిండి పెడుదువుగాని.

సుశీ— (కోపంతో) నేనుపెట్టనుపో (విలుగుతుంది)

రంగా— (పైకొస్తు) చంపేస్తాను.

సుశీ— నాన్నను రానీ చెపుతాను (ఏడుస్తూ)

రంగా— ఓ పెద్దఆస్తి రక్షకుడుదొరికాడు (ఎగతాళిచేస్తూ)

పద. అన్నం పెడుదువుగాని.

సుశీ– నే నెందుకు పెట్టాలి?

రంగా– తంతాను

సుశీ– ఏది! తన్నూ చూద్దాం? (నిర్భయంగా)

రంగా– తిండి పెట్టవన్న మాట?

సుశీ– హు హు

రంగా– నే నే పెట్టుకుతింటాను. (వెళ్ళబోతాడు)

సుశీ– (అసహ్యంగా) సిగ్గులేకపోతే సరి

రంగా– ఏమన్నావ్ (కొట్టబోతాడు సుశీల అరుస్తుంది. యింతలో నరసయ్య వస్తాడు)

నర– (కోపంతో) ఏమిట్రా అది? ఏమిట్రా చూస్తున్నావు! ఆడపిల్లను కొడతావా? నువ్వు కడుపుకి అన్నం తినటం లేద్రా?

రంగా– (అగిపోయి) బ్రతికిపోయావుపో! (లోపలకు వెళ్ళాడు రివ్వున. సుశీల కన్నీళ్ళు తుడుచుకొంటూ నరసయ్య దగ్గరకొస్తుంది. నరసయ్య తలనిమురుతూ)

నర– (ప్రేమపూర్వకంగా) కొట్టాడా?

సుశీ– (లేదన్నట్లు తలవూపుతుంది.)

నర– వాడసలే వట్టిపశువు. వాడిజోలికెందు కెళ్ళావమ్మా? వాడిపుటకతగలెయ్య. వాడిమూలంగా నాప్రతిష్టలు నాశనమై పోతున్నాయి. (బాధగా) నాకడుపున

సుశీని చూడగానే భయపడతాననుకొన్నా! (రంగారావు వెళ్ళిపోతాడు. సుశీల మంచినీళ్ళ గ్లాసుతో వస్తూంది)

సుశీ— యిదిగో నాన్నా మంచినీళ్ళు (యిస్తుంది)

నర— (తీసుకుంటూ) ఏంతీసుకెళ్ళాడు?

సుశీ— నా పెట్టిపగలగొట్టి నువ్వు మొన్న మహాశివరాత్రి నాడు యిచ్చినపదిహేను రూపాయలూ ఎత్తుకెళ్ళాడు

నర— చూశావటయి, వాడిపుటక కాశగలెయ్యా; యింకా డజన్మ అంతే. గాను, రాము, నలుగురిలో తలెత్తుకోటానికి గుణం లేకుండా! కొంపలమ్మట తిరగటం, చీట్లపేకలూ. ఊరంతా అప్పులూటా: నా మూన మర్యాదల్ని గంగలో కలుపుతున్నాడు. నేనిస్తా లేదురుకోవద్దు. నీడబ్బు (నిట్టూర్చి) ఏనాడు చేసుకున్న కర్మో యివ్వాళ అనుభవిస్తున్నాను.

సుశీ— యివ్వాళ అనుకుంటే లాభమేముంది నాన్నా వాణ్ణి చిన్నప్పటినుండీ తయారుచేసింది మీరే కాదూ?

నర— బాగుపడి చస్తాడనుకున్నాగాని, యిలా చెడిపోయిన తర్వాత గాడిదల్లే నీసొమ్మంటా తీసుకుపోతాడనుకున్నానా?

సుశీ— ఆవేళ వాణ్ణి చదివించటంచేత మీరనుకున్నారు గాదయ్యా? అబ్బాయి కొంచెం పోతాడనుకుంటే యివ్వాళ ఎం... కి రాకుండా తిరుగుతున్నాడయ్యా; ... చాది మానయ్యింత యివాళ ...చగ...?

నర- (దగ్గుతాడు. కొద్దిసేపు నిశ్శబ్దం, యింతలో రాఘవయ్య వస్తాడు, వయస్సు 35 సంవత్సరాలుంటయి. పైపంచ బారుగా జారవేశాడు కట్టుపంచ, కాళ్ళకు అడ్డుపడుతూ నేల రాసుకుంటుంది. బక్కపలచగా పొడుగ్గావుంటాడు. నోట్లో పెదాలమధ్య పుగాకు కాడవుంది. ఒక కాడచించి చుట్టచుట్టుకుంటు నిర్లక్ష్యంగావచ్చాడు)

నర- రారా. రాఘవయ్యా! రా,

రాఘు- దేనికే నరసయ్యన్నా పిలిచావట?

సుశీ- (ఆత్రుతగా) నువ్వుకొండకు వెళ్ళలేదా బాబాయి

రాఘు-(కూర్చుంటూ) వెళ్ళేనుగా (చుట్టముట్టిస్తాడు)

నర- వెళ్తే మావాడుకనుపించాడా?

రాఘు- ఓరిపిడిశగతరగా. పట్టినెధవ పుగాకిచ్చాడు, పట్టితడి ముద్ద. ఎన్నిపుల్లలు పెట్టికాల్చినా కాలిచావిందే, మన కోమటి గురవయ్యకు పొయ్యేకాలం వచ్చిందే. నరసయ్యన్నా; (చుట్టచివరకొరికి,క్రిందఊస్తాడు)

సుశీ- ఏంబాబాయిఅన్నాయికనుపించలా?

రాఘు-ఎవరూ రామచంద్రమేనా!

నర- అవునుబా?

రాఘు-ఆ, కనుపించకేం. కనుపించాడు. నేనువచ్చేటప్పుడు కొట్లోనానుకూడాను.

నర- యిదేం అనర్థంరా? కొండదగ్గర కలరావ్యాధి తీవ్రంగా

రాఘు–ఉన్నమాటయథార్థమే. కాని. మనవాడు ఈపాటికేవ స్తూనేవుండాలి, నిన్ననే ఎడ్లపందాలు గూడాఅయిపోయినై

నర– పందాల్లోనేపూరి ఎడ్లుగెలిచినైరా ఈసంవత్సరం?

రాఘు-మన ఊరియెడ్లే గెలిచినై.

సుశీ– ఎవరివి బాబాయి. గెలిచింది?

రాఘు–ఈచుట్టుప్రక్కల పదియిరవై ఊళ్ళల్లో మీఎడ్లనుఓడించేయి వున్నయ్యా?

సుశీ– మాఎడ్లుగెలిచినయ్యా బాబాయి.

రాఘు- ఔను, ఓసి వాటితల్లిశిగతరగా; మరీఆపాలబట్లయెద్దు కాడిక్రిందనిలిచిందట నరసయ్యన్నా? బండిగట్టికన్నుమూసితెరిచేలోగా అవతలహద్దుదగ్గర కెళ్ళిఆగినైయనుకో; అసలురెండూరె డేనే. సివ్వాపుపిల్లలు.

నర– అదంతామాపెద్దవాడి తరిఫీదురా, అసలుఆఎడ్లంటేనే వాడికిపంచప్రాణాలు.

సుసీ– అన్నాయి యిరవైనాలుగు గంటలూ ఆ ఎడ్లదగ్గరే ఉంటాడు.

నర_ మా ఎడ్లమీద ఓడిపోయింది ఎవరివిరా!

రాఘు–(చుట్ట పారవేసి) యింకెవరివీ? మన ఊరి పాపుకాంతుగారివే, ఓసి వాటి పడిచావ! ఊరపందుల్లేతిని తెగ

బలిసినై కాని వాడిగట్లగానే గ్రుడ్లుమిటకరించి ఎమక తిరిగి నిలబడ్డయ్యే నరసయ్యన్నా.

నర- (నవ్వి) అవి ఎప్పుడూ అంతేరా!

రాఘు- ఈసంవత్సరం కొండవగ్గర అన్నివేలజనాన్ని మూర్చ పోగొట్టినై మీఎడ్లనుకో! అరెరె ప్రతివాడూ ముక్కుమీద వేలువేసుకొన్నారే నర్సయ్యన్నా! మీఎడ్లనుచూట్టానికివచ్చేజనం, పోయ్యేజనం, ఓహో! ఇతీర్థప్రజలంతా యిరగబడిందనుకో. ఒక్కపక్కన తన యెడ్లు ఓడిపోయినందుకు సిగ్గుపడిచావక పైగాసవాళ్ళు చేశారు షావుకారుగారు.

నర- మావాడు మళ్ళీయెదురుచేయలేదు గదా?

రాఘు-అంతవరకొచ్చినాక ఎప్పుడూ ఊరుకొంటాడే? తలొకనూటా అన్నారు.

సుశీ- ఎవరినీ?

రాఘు- ఈజగన్నాథంగుంపునే.

నర- మావాడుగూడా యేమన్నా అన్నాడా?

రాఘు-ఏదో యిద్దరూ కీచులాడుకున్నారు. నువ్వొంతంటే. నువ్వెంతని?

నర- బాగానేవుంది యిదావాడు చేసిన ఘనకార్యం పందాకువెళ్ళిపోట్లాట తెచ్చాడు!

రాఘు-వాడితప్పేముందే నరసయ్యన్నా. ఓడిపోయింది చాలక వాళ్ళే సవాళ్ళుచేశారు.

సుశీ- వాళ్ళుచేస్తే ....

రాఘు-ఏం? డబ్బుగలవాడైనంత మాత్రాన అభిమానం జంపుల్లాని అన్ని వేలమందిలో వాళ్ళచేత అడ్డమైన మాటలు పడమంటారటే నర్సయ్యన్నా?

నర- బాగా నేవుంది. మీరంతా వెళ్ళి యిద్దర్రా చేసింది? వాడసలే తొందరమనిషి. పెద్దవాడివి నీకన్నా తెలియ వక్కర్లేద్రా!

రాఘు-నన్నేం జేయమంటావే? ఎద్దు ఓడిపోగానే పలుగురూ నాలుగన్నారు. దాంతో వాడికి కోపమెక్కిందా? అజగన్నాథంగాడి పాలేరు నాలుగంటే మనవాడు రెండన్నాడు తప్పేముంది?

సుశీ- ఈ తగాదాలు ఊరికినే పోతయ్యా బాబాయి?

రాఘు-ఆ.... ఏమిటి వాడుచేసి చచ్చేది?

నర- వాడుతెలుసుకుంటే ఏదైనా చేయగల సమర్థుడు, ఈ పడిన నిప్పుకణాలు ఊరికినే ఆరతయ్యట్రా? (యింతలో సత్యం వస్తాడు. వయస్సు 24 సంవత్సరాలుంటయి. పైజమా-లాల్చి. రిస్టువాచీ కాళ్ళ కిసాదా చెప్పులు)

సత్యం-ఎప్పుడొచ్చావు మావయ్యా కొండగ్గర నుండి?

రాఘు-రాత్రేవచ్చారా అబ్బాయి-నువ్వురా లేదేరా?

సుశీ ఆయినగారికి దేవుడు లేడంట బాబాయి:

సత్యం-సుశీలకు దేవుడున్నాడా? నువ్వునిజం చెప్పు రాఘ వయ్యమావా? (చిరునవ్వుతో)

రాఘు-(నవ్వుతూ) యింట్లో దేవుడుండగా మరొక దేవుడెం దుకురా సత్యం

నర- (అర్థంకాక) యింట్లో దేవుడెవర్రా?

రాఘు-(చమత్కారంగా) యింకా వేరేదేముందెందుకే మన సత్యం వుండగాను.

సుశీ- (సిగ్గుతో) పో! బాబాయి. నీదంత చెతురు. (అంతా నవ్వుతారు)

సత్యం-చతురేమిటిమావా! నాకన్నామించిన....

నర- ఆ....మీ పనులెంత వరకొచ్చినైరా సత్యం

సత్యం-చాలా వరకైనట్లే! రేపు రాత్రికి మన శివాలయం దగ్గర ఒక నాటక ప్రోగ్రాం ఏర్పాటు చేశాము. మీా రంతా రావాలి.

రాఘు-అలాగే వస్తాం లేరా! ఒరేయ్ సత్యం నువ్వు వచ్చి నాక నేయాపంచాయితీ పరిపాలనకాస్త బాగుపడింది

అదివరకు ఈ ఊరినిగురించి ఒక్క గాడిదకొడుకు పట్టించుకొన్నాడట్రా !

సుశీ- (వెటకారంగా) ఆ... పట్టించు కొంటున్నాడు బాబాయి మీా అల్లుడు

రాఘు- (అర్థంకాక) ఏమిటే !

సుశీ- వంటినిండా బురద (నవ్వుతుంది. అంతా నవ్వుతారు) దొరగారల్లే రోజుకొక జతగుడ్డలు పాడుజేస్తూ౽ము

నర (చిరునవ్వుతో) సత్యం, నువ్వు ఎంత పట్నంలో చదువుకున్నా, మా సుశీల నీకంటే మాటల్లో తీసిపోతుందటయ్యా !

సత్యం- అందుకనే ముక్కు మొహం ముడుతలు పడ్డ ముసలాడికిచ్చి చేస్తే అమ్మాయి తిక్కకుదిరేది.

సుశీ- (గారాబంగా) చూడునాన్నా ?

సత్యం- సుశీ... కాసిని మంచినీళ్ళు తెచ్చిపెట్టు.

సుశీ- ఆ... తెస్తా పాపం, త్రాగునువుగాని వుండు.

నర- పోయిరామ్మా. (నవ్వుతాడు. సుశీల వెళ్ళింది)

సత్యం- రేపు మీారు తప్పక రావాలి మాంవా.

రాఘు- అట్లాగే వస్తాం లేరా.

నర- యిప్పుడు ఎంతడబ్బు వసూలు చేశార్రా !

సత్యం- యిప్పటికి పదివేలు దాదాపు వసూలైయింది. నాలుగు వేల జనాభావున్న ఈఊరికి ఒక స్కూలు గాని, హాస్పటలు గాని, పదిమందీచేరి చదువుకొనేటందుకు లైబ్రరీ గాని, లేవా? యివన్నీ కట్టించాలంటే కనీసం యిరవై వేలన్నా కావాలి.

రాఘు- యిరవై వేలే (ఆశ్చర్యంగా) అంతడబ్బు వసూలవ్వద్దట్రా?

నర- ఎందుకుకాదూ! నలుగురూ నాలుగుచేతులేస్తే ముప్పై నలభై వేల వరకూ తేలిగ్గా వసూలౌతుంది.

సత్యం- ఊళ్ళో కామయ్యా జగన్నాధం లాంటి ఒకళ్ళిద్దరు యివ్వకపోతే మాత్రం మీలాంటి వాళ్ళు మాకుఅండగా వుంటే అంతేచాలు మావా?

రాఘు- జగన్నాధం ఏమన్నాడురా?

సత్యం- ఏమంటాడు, చదువుకునేవాళ్ళకు స్కూళ్లైనా! చచ్చిన వాళ్ళకు సమాధులుకూడా కట్టిస్తారా? అన్నాడు. యిక ఆ కామయ్య, మందుల దుకాణాలెందుకోయ్ మన ఊళ్ళో అవి పెట్టినదగ్గరనుండీ మంచివాళ్ళకు కూడా మరసనాడే మహావ్యాధులు పుట్టుకొస్తాయి. అన్నాడు.

రాఘు- ఆయిచ్చిన డబ్బుతో ఒకడికి సమాధి రెండవ వాడికి శ్రాద్ధంచేయిస్తా ననకపోయావా- మెతుకుపోతే బ్రతుకు

పోతుందనే యిలాంటి గాడిదకొడుకు లుండబట్టే ఈ ఊరి కీగతిపట్టింది.

నర- (అసంతృప్తిగ) అదేమిటిరా రాఘవయ్యా. వాళ్ళ క్షిష్టమైతే యిస్తారు. లేకపోతే లేదు. అందుకని వాళ్ళను తిట్టడం ఏంమర్యాదరా?

రాఘ- చాల్లే ఊరుకోవే నరసయ్యన్నా. వాళ్ళుచేసి చచ్చేది లేకపోగా, సమాధులు కట్టిస్తారా? అంటే? తల్లి శిగ్గొయ్యా! దానర్ధమేమిటో?

సత్యం- వాళ్ళన్నారని మనప్రయత్నాల్ని మానుకుంటామా?

రాఘ- అంతేలేరా, వెనకటికో ముసలమ్మ, నాకోడి నానిప్పు లేకపోతే ఈఊరు తెల్లవారదంటట. వీళ్ళిద్దరూ యివ్వక పోతే మునిగిపోదులే! ఏదో ఎద్దుముడ్డి పొడుచుకునే మాకు యివన్నీ తెలిసి చావక కాని, లేకపోతే ఈఊరి కిట్లాంటి గతిపట్టేదా?

సత్యం- తెలుసుకోవాలి మావా? రేపురాత్రికి ఈ గ్రామ పునరుద్ధరణ సహాయంకోసమే పట్నంనుండి నాటకాలు ఆడేవాళ్ళను పిలిపిస్తున్నాను. మీరు తప్పక రావాలి.

రాఘ- నువ్వు యిన్నిసార్లు చెప్పాలా! ఎవడింట్లో పెళ్ళిరా! వస్తాంలే; (సత్యం లోపలికెళ్ళి పోతాడు.)

నర- బజారుకొస్తావట్రా రాఘవయ్యా.

రాఘు- దేనికి ?

నర- నాకు ఆ కరణంగారింటిదగ్గర పనుంది. వెళ్ళిరావాలి. (లేస్తాడు)

రాఘు- పద, నాకూ ఆచళ్ళ కార్ఖానాదగ్గర పనుంది. (యిద్దరూ వెళుతూ వుంటారు) యిదిగో నరసయన్నా, సత్యం చాలా తెలివైనవాడే! అట్లాంటివాడు ఊరిగోకడుంటే చాలదూ ?

నర- యివ్వాళ వాడితల్లీ, తండ్రీ బ్రతికివుంటే ఎంత సంతోషించేవాళ్ళోరా! (విచారంగా)

రాఘు- నిజమే పాపం! కాని... ఆలోటు నువ్వు తీర్చావులే. పదవే నరసయన్నా (వెళ్ళిపోతారు. సుశీలవచ్చి చూచి ఆశ్చర్యపోతుంది. యింతలో సత్యం లోపలనుండి చకచకా బయటికి వెళుతుంటాడు.)

సుశీ- ఏమండోయ్ దొరా; ఎక్కడికీ ప్రయాణం. (బిగ్గరగా)

సత్యం- ఊళ్ళోకండి దొరసానిగారూ. (ఎగతాళిగా)

సుశీ- తెల్లవారే టప్పటికి మీరు, కాఫీలు, ఉపమాలు మెక్కి కళ్లో జోగా అటూ ఊరంతట తిరుగుతుంటే మీకోసం ఎంతవరకని తిండి తినకుండా వుండేది?

సత్యం- నిన్ను ఎవరు తినవద్దన్నారు ?

సుశీ- ఒకళ్ళొద్దన్నారని కాదు. మీరు తినకుండా నేనా ?

సత్యం-ఏం? నేను తినక పోతే నువ్వు తిన గూడదా?

సుశీ- యింకా నయం, నలుగురూ ఏమను కుంటారు?

సత్యం-అయ్యవారి సెండగట్టి అమ్మగారు భోంచేశారను కుంటారు

సుశీ- మీ పరిహాసాల కేంగాని లే. పదండి తిండితిని వెళు దురుగాని.

సత్యం-యిదిగో సుశీ. నన్ను దేనికి ప్రాణం తీస్తావుగాని. నా కు ఆకలిగా లేదబ్బా-

సుశీ- (ఎగతాళిగా) ఎట్లా వుంటుందబ్బా- తినేది అత్త వారింటి దగ్గర అగణమయ్యె

సత్యం-(బెదిరిస్తూ) నీకంత కష్టంగావుంటే నా పెట్టా బేడా సర్దు. నేను పట్నం వెళ్ళిపోతాను.

సుశీ- (దిగులుగా) యిప్పుడు నేను యేమన్నానని?

సత్యం-మీనాన్నగారియిల్లంతా గుల్లచేసిరింటున్నాడనటంలా?

సుశీ- నేనన్నదాంట్లో అదా అర్థం? (కన్నీళ్ళు పెట్టుకొని)

సత్యం-అర్థం యేదైతేనేమట్టుకు నాకేం గావాలి. నేనీరాత్రికి పట్నంవెళ్ళి పోతాను. (నటిస్తూ)

సుశీ- అయ్యో: దిక్కుమాలిన దాన్ని. నేను తెలియక న్నాను

సత్యం-(కోపంనటిస్తు) నేను తెలియకే వున్నాను.
సుశీ- (ఏడుస్తు)నన్నుగూడా మీవెంట తీసుకెళ్ళండి
సత్యం-నాకేం మదులా! మాన్యాలా! నేనునీకు అరణంపెట్ట గలనా? అందలాలు ఎక్కించ గలనా?
సుశీ- అయితే నన్నుచంపేసి మరీవెళ్ళండి
సత్యం-(చాటుగాతిరిగి ముసి ముసి నవ్వులు నవ్వుతూ) నిన్ను చంపితే నన్నుజైల్లో వేయటానికా?
సుశీ- (ఏడుస్తు)మరి మిమ్మల్ని విడచి నేనెక్కడుండేది?
సత్యం-(నిర్లక్ష్యంగా)ఏమో నాకేం తెలుసు?
సుశీ- (విచారంగా)పోనీ మీకు ఇంత బరువైతే నేనే దేని క్రిందనన్నా బడిచస్తాలెండి.
సత్యం-(నవ్వుతూ తిరిగి)నీకు పుణ్యముంటుంది గాని ఆపని మాత్రం చేయకు.
సుశీ- (బెదిరిస్తూ)మీకూ బరువైనాక నేనెందుకు బ్రతకాలి?
సత్యం-(బుజ్జగిస్తు)సుశీ. ఏదో ఎగతాళికన్నాలే? ఊరుకుందూ
సుశీ- (పలుకదు)
సత్యం-సుశీ.... నాపైనకోపం వచ్చిందా? (బ్రతిమాలుతూ)
సుశీ- (ముఖం త్రిప్పుకొని)కోపం, తాపం రావటానికి నేన

వరినీ? (వెళ్ళబోతుంది పట్టుకుని).

సత్యం-అరే; నిజంగానే కోపమొచ్చిందే: ఆడవాళ్ళకు కోపం ముక్కుమీద! ఏమువు:ళ్ళల్లోనూ పెట్టారు.

సుశీ- (కోపంగా) పెడితే పెట్టార్లే!

సత్యం-సుశీ....(బ్రతిమాలుతూ)

సుశీ ఇకమీరు నాతో మాట్లాడకండి (విదిలిస్తూ)

సత్యం-ఆదేమిటి? యింతలోనే ఆజన్మవిరోధినై పోయావు? (ఆశ్చర్యముగా)

సుశీ- లేకపోతే మీరు....

సత్యం-(నవ్వి) పట్నం వెళతానన్నాననా? పట్నంలో ఏముంది? యిదిగో! నిన్నువిడచి పెట్టి వెళ్ళతూగా

సుశీ- తిండీతిప్పలు లేకుండా తిరిగితే. ఆరోగ్యం చెడిపోతే

సత్యం-(నవ్వి) ఓహో! అదా! యిదిగో! నువ్వులెక్కపెడుతూ వుండు! పదినిమిషాల్లో వచ్చేస్తాను ఓ మై డియర్.సుశీ నిన్ను కష్టపెట్టటం నాకుమాత్ర యిష్టమా?

సుశీ- అయిన ఆలశ్యం చాలుగాని యిప్పుడన్నా వెళ్ళి ఆ రాచకార్యం చక్కపెట్టుకురండి!

సత్యం-ఆల్‌రైట్ బ్రతికాను. (వెళ్ళబోయాడు. యింతలో జగన్నాథరావు కుమార్తె శ్యామల వస్తుంది. వయస్సు

15 సంవత్సరాలుంటాయి. క్రొత్తచీర, క్రొత్తజాకెట్టు తలదువ్వించుకోటానికికొన్నిమల్లెపూలు ఒళ్ళోపోసుకొని వస్తుంది )

శ్యామ-(వస్తూ) ఏమిటన్నయ్యా ఒదిన పోట్లాడు తుంది?

సత్యం-(నవ్వి) ఒదినలు పోట్లడక మాట్లాడతారా? నన్ను తన పమిటి చెంగుకు పెట్టికట్టివేస్తాను, కదలకుండా నాదగ్గర కూర్చొ వయ్యా అంటుంది.

శ్యామ-(నవ్వి) ఏం వదిన మా అన్నయ్యను కొరుక్కు తినే టట్లున్నావే.

సుశీ- ఆఁ కొబ్బరి బెల్లమని(అంటానవ్వుతారు. సత్యంబయటకు వెళ్ళి పోతాడు.)

శ్యామ-ఒదినా! ఈపూవులుపెట్టి జడవేస్తావా?

సుశీ- (చిరునవ్వుతో) వంకేలు జడేనా?

శ్యామ-అబ్బ! పోఅమ్మా! నీకెప్పుడూ ఎగతాళీ.

సుశీ- అదేం వయ్యారమే యిప్పుడే వయ్యారము వలకబొయ్యకూ మాఅన్నయ్య వచ్చిదాంకా కాస్తదాయి

శ్యామ-నేను యింటికి వెళ్ళిపోతున్నాలే!

సుశీ- ఎందుకే ఈసింగారం? మాఅన్నయ్య వస్తున్నాడనేనా

శ్యామ (సిగ్గుతో తలవంచుకొని అదోలాచూస్తుంది) నేనింటికి వెళ్ళాలమ్మా!

సుశీ- (నవ్వుతూ) నాదగ్గరదాచినా మాఅన్నయ్య దగ్గర దాయ లేవుగా? రానీచెప్తాను.

శ్యామ-(కోపాన్ని అభినయిస్తు) పోమ్మా! నీకెప్పుడూ ఒకటే చెతురు.(వెళ్ళబోతుంది. వాకిట్లోకాలు పెట్టగానే చంద్రం హుషారుగా లోపలికొస్తుంటాడు. యిద్దరూ వాకిట్లో ఢీకొంటారు. ఈసంఘటనకు శ్యామల ఒడిలోని పూలన్నీ చెయిజారి చంద్రం పాదాలమీదపడి చెదిరిపోతయి, చంద్రంఆశ్చర్య ప్రేమపూర్వక మైన చూపులు శ్యామలను చక్కలిగింతలు పెట్టినట్లుగాచేస్తయి. శ్యామల సిగ్గు భయాలతో తలవంచు కుంటుంది. ఆకస్మికంగా యిద్దరిచూపులూ కలుస్తాయి చిరునవ్వులు పెదాలమీద నృత్యంచేస్తున్నాయి. యిద్దరూ ఒక్కసారేవంగి ఆపూలువేరుకో బోతారు. యిద్దరి తలలూఢీకొంటాయి. అబ్బ! అంటూ యిద్దరూ లేస్తారు. శ్యామలకు సిగ్గూకోపం వస్తాయి. అక్కడనుండి దూరంగా వెళ్ళినిలబడుతుంది. ఒకచేతిలో కొండ దగ్గరిగెలుచు కొచ్చిన [illegible]ండుకప్ప గంటల పట్టుకొచ్చిన చంద్రుడికోలు, వుంటాయి. సుశీలయిది చూచి నవ్వుకుంటూ లోపలకెళ్ళి పోతుంది. సుశీలలేకపోవటం చూచి

శ్యామల కంగారుపడి లోపలకు పారిపోతుంది. చంద్రం శ్యామలను పట్టుకోబోతాడు దొరకకుండా తప్పించుకుంటుంది గాని. శ్యామల దారికడ్డంగా చంద్రం నిలబడి అదివరకు ఏరినపువ్వులు యివ్వబోతాడు శ్యామల సిగ్గూభయాలతో)

శ్యామ-నాకొద్దుపో!(దూరంగా జరుగుతుంది. చంద్రంనవ్వుతాడు)దారికడ్డంగా లే వెళ్ళాలి:

చంద్ర-వదిలిపెట్టను. పారిపోతావేం?

శ్యామ-పారిపోక, నీప్రక్కనకూర్చుంటాలే పాపం!

చంద్ర-ఎప్పుడైనా తప్పదుగా,

శ్యామ-(నవ్వునణచుకొంటూ)అప్పుడుకూర్చుంటాలే: దారికడ్డంలే. నేనువెళ్ళాలి, మళ్ళీ, సుశీలవస్తుంది

చంద్రం-(నవ్వుతూ) వస్తేనేం?

శ్యామ- ఏమనుకుంటుంది? (భయంగా)

చంద్రం-మొగుడూ పెళ్ళాలనుకొంటుంది,

శ్యామ-(కంగారుగా) సంతోషించార్లే!

చంద్రం-సమ్మతించాంలే!(నవ్వుతాడు)

శ్యామ-దారివదలిపెట్టు (కోపంనటిస్తు)

చంద్రం-పారిపొనని వట్టుపెట్టు (పట్టుపడుతూ)

శ్యామ-అబ్బా, వదలండీ (జాలిగా)

చంద్ర-అబ్బ! పట్టుపెట్టండీ! (ఎగతాళిగా)

శ్యామ-సరే. వెళ్ళనులే! (మృదువుగా)

చంద్ర-సరే విడిచానులే; (చిరునవ్వుతో)

శ్యామ-(దూరంగాపోయి నుంచుంటుంది. చంద్రం మెల్లగా వెనక నిలబడతాడు)కళ్ళుమూసుకుని నడవటం మానుకోవాలి!

చంద్రి-అదేనువ్వూ నేర్చుకోవాలి! (నవ్వుతూ)

శ్యామ-ఆ.... నేర్చుకున్నాను. ఇకమీా యింటికి రాకూడదని (కోపం నటిస్తూ)

చంద్రి-మృదువుగా)నామీాద కోపంవచ్చిందా?

శ్యామ-(బెట్టుగా) నన్ను నలుగురిలో (మధ్యలో)

చంద్ర-పెళ్ళిచేసుకుందా మనుకొన్నాను. కాని. మీానాన్న చెయ్యండే నేనేంచేస్తాను.

శ్యామ-(నవ్వుతూ)ఎప్పుడో చేస్తాడు కట్రితీసుకొని. (తప్పించుకుని కిలకిలానవ్వుతూ పారిపోతుంది లోపలకి. చంద్రం నిస్పృహాయుడిలా)

చంద్ర-(బ్రతిమాలుతూ)శ్యామలా! యిదిగో! శ్యామలా'ఒక్కమాట, (వెళ్ళిపోయింది చంద్రంనోటితో ఏదో ఈలపాటపాడుతూ వచ్చిపట్టిన్నాు చంద్రాకోలా అక్కడ

పడ వేస్తాడు. యింతలో సుశీల శ్యామలా తిరిగివస్తారు శ్యామల వెనక నిలబడి దొంగచూపులు. చూస్తుంది. సుశీల కోపం నటిస్తుంది)

సుశీ- ఏమిటన్నాయి యిది?

చంద్ర-(ఆశ్చర్యముగా) ఏమిటి?

సుశీ- సాహుకారు గారమ్మాయిని పెళ్ళి చేసుకుంటా నన్నావటగా?

చంద్ర-(తెలియనట్లు) అబ్బే! ఆ అమ్మాయే నన్ను చేసు కుంటానంటుంది.

శ్యామ-అబ్బా పో! వదినా!

(యింతలో నరసయ్య లోపలికి వస్తాడు. అంతా తేలు కుట్టిన దొంగల్లా వూరుకొంటారు)

చంద్ర-యీ వెండికప్పు తీసుకు వెళ్ళి బీరువాలో పెట్టమ్మాయి (యిస్తాడు)

సుశీ- నాన్నా నాన్నా అన్నయ్య కొండదగ్గర గెలుచుకు వచ్చిన వెండి కప్పు యిదుగో,

నర- (నవ్వుతూ) అది అన్నయ్య గెలుచుకొచ్చింది కాదమ్మా మనయింట పుట్టిన ఎద్దు గెలుచుకొచ్చింది. (కూర్చుంటూ) ఎప్పుడొచ్చావురా?

చంద్ర-యిప్పుడే నాన్న. (యింతలో రాఘునయ్య పెద్దపెద్దగా అరుస్తూవస్తాడుబయటనుంచి)

రాఘు- తల్లి శిగ్గొయ్య ఓడిపోయినందుకు ముందెన్నో మూ
కూర్చోకసిస్సులేక శివాలెత్తుతున్నాడు.

నర- ఎవర్రా, ఎవరూ?

రాఘు- యింకేవరు వచ్చారే? ఆజగన్నాథంగారే! (శ్యామలను చూచి నాలుక కొరుక్కుంటాడు. శ్యామల మొఖం నల్లబడుతుంది. గబగబా వెళ్ళిపోతుంది.) తల్లి సిగగొయ్య ఎంతబుద్ధితక్కువపనిచేశా నేనరసయ్యన్నా

చంద్ర-(కోపంతో లోపలకు వెళతాడు )

సుశీ_ అన్నయ్యా, అన్నయ్యా (అంటూ సుశీల వెళుతుంది అంతా ఆశ్చర్యముగా చూస్తుంటారు)

-:[తెర]:-

# రైతుబిడ్డలు

:- రెండవరంగం :-

[తెర]

సీను- (అది జగన్నాధరావు మేడ- మేడముందు వరండా హాలు- హాలులో ఒక పడక కుర్చీ రెండు సాదాకుర్చీలు. ఒక పొడుగు పాటి బెంచీ బల్ల- సింహ ద్వారపు చెక్కపైన కొన్ని బొమ్మలు- రెండుమూడు కాగితాల పూల చెట్లూ వుంటాయి. తెర లేవక ముందే జగన్నాధరావు బయిటనుండి వస్తూ భయంకరంగా అరుస్తూ వుంటాడు)

జగ- గెలిచారు లేవోయ్. ముండమోపులు- అడ్డమైన గడ్డి తిని ఎట్లాగైతేనేం! ఔనని పించుకున్నారే

ఒకగొంతు-ఆఎడ్లను చూచుకొని ఆయన భూమిమ్మీద ఆగేటట్టున్నాడా దొరా! యింత జరిగినాక రోషం వేసినవాడు గూడా కత్తెట్టుకుని పొడుచుకుని చస్తాడే! మీరెట్లా భరించారంటా!

జగ- (కటువుగా) యిల్లలకగనే పండగయిందట్రా. ముందుంది ముసళ్ళపండగ.

ఒకగొంతు-దొరా! దొరా! ఆసిముతావాళ్ళు వత్తున్నారు. ఊరుకోండి. (తెరలో పెద్దగానవ్వులు పాటలు వినుపిస్తయి.)

ఒకడు-వెనారు గద్దల్ని తిన్న రాబంధు ఒక్కగాలి పెట్టుకు చచ్చిందని, మనవాడు పద్రం పీడికితకిన బుద్ధిచెప్పి పంపాడ్రా! (జగన్నాధరావు చెమటలుక్రమ్మిన ముఖంతో లోపలికొస్తాడు. బయట)

రెండవవాడు- (పెద్దగానవ్వి) బుద్ధిచెప్పడమేమిటి. నీమొఖం ఒక్కదెబ్బతో నమాశానికంటింది. లేకపోతే ఈఅక్క పక్షికి ఎడ్లపందాలేమిట్రా?

ఒకడు- బాగాచెప్పావు! (పెద్దగానవ్వులు. జగన్నాథరావుముఖం ఎర్రపడి కోపంతో నిప్పులురాలుతున్నట్లుంటుంది. ఆవేశంతో వెళ్ళి రొప్పుతూ కుర్చీలోకూలబడతాడు, వయస్సు 49 సంవత్సరాలుంటయి. నల్లగా. బొద్దుగా వుంటాడు. కోరమీసం? చేతిలో జెండిపోన్ను కర్ర, క్రూరత్వం ముఖంలో ప్రతిఫలిస్తూవుంటుంది. మెడమీదనున్న కుచ్చు కండువా? తీసికుర్చీమీద విసురుగావేసి జారగిలపడ్డాడు)

జగ- (పెద్దగా) అమ్మాయ్. శ్యామలా! (పెద్దగా) శ్యామలా! (కొద్దిసేపు ఆగి) ఎక్కడ జచ్చావే!

శ్యామ-(లోపల నుండి) ఆ.... వస్తున్నా నాన్నా.

జగ- (విసురు కుంటూ) వట్టిచేతులతో దేనికే? కాసినిమంచినీళ్ళు పట్టుకురా!

శ్యామ-(లోపల నుండే) అలాగే నాన్నా. (యింతలో కామయ్య వస్తాడు. ఎత్తుగా టక్కపలచగా వుంటాడు. క్రాపు అంతకు ముందే చేయించి వట్లున్నాడు. మీసాలు పూర్తిగా తీసివేశాడు. కట్టుపంచ శీలమండల వరకూ వుంది. లాల్చీ-చంకలో సన్నని ముల్లుకర్ర-మెల్లగా చీమచావనట్లుగా నడుస్తాడు సన్నని వుగాకు చుట్ట చుట్టుకుంటూ నీటుగా వచ్చాడు.)

జగ- రారా! కామయ్యా! రా!

కామ-(ఒకసారి జగన్నాథ రావుని చూచి నవ్వుతూ వెళ్ళి కుర్చీలో కూర్చుంటాడు. ముల్లు కర్ర ప్రక్కన పెట్టి నిశబ్దంగా)

జగ- (కోపంతో) విన్నావట్రా! ఊళ్ళోవాళ్ళు చేస్తున్న అల్లరి.

కామ- (నెమ్మదిగా) విన్నాను. (చుట్ట వెలిగించుచూ)

జగ- వాళ్ళకు పట్టపగ్గా లేకుండా వున్నాయిరా?

కామ- ఎన్నాళ్ళేం? ఈ గాడిదకొడుకులకు అంతకంగారు పని

వేం? నేననకూడదు గాని, వాళ్ళు చేయ గలిగిందంతా చేశారు యిక మన వంతు వచ్చింది.

జగ- (నిరుత్సాహంగా) మనం ఏం చేయగలంరా ?

కామ- (విషపు నవ్వు నవ్వి) పిట్ట మనచేతిలో పడిందిగా యిక ఈ శిఖండి చేత ఏదైనా ఆడిస్తాను.

జగ- ఏంచేస్తావురా ! ఆ రంగారావుగాడు ఏం చేసిచస్తాడు ? దరిద్రుడు వాడికి మొన్న అనవసరంగా వెయ్యి రూపాయలు యిప్పించావు.

కామ- మొన్న వెయ్యి రూపాయలతో తృప్తి పడలా ! యివ్వాళ మళ్ళా నాలుగు వందల కోసం వచ్చాడు.

జగ- ఎక్కడ పోసి పెట్టి వున్నాయి. ఈ గాడిదలకు అడిగి నప్పుడల్లా అందివ్వడానికి ! యిప్పటికి జరిగిన అప్రతిష్ట చాలకనా ?

కామ- నేననగూడదుగాని ఆ అభిమానం నాకుమాత్రం లేదంటరా ! మీకెందుకు నే చెప్పినట్లు చేయండి. వాడి నెత్తి వాడి చేతులతోనే పగలగొట్టిస్తాను,

జగ- ఏం పగలగొట్టిస్తావో ? యిప్పటికే వూళ్ళో తలెత్తుకో లేక చస్తున్నాం, (యింతలో శ్యామల వచ్చించి మంచి నీళ్ళగ్లాసుతో జగన్నాధరావు మంచినీళ్ళు త్రాగుతుంటాడు. శ్యామల కామయ్యనుచూచి బిత్తరుపోయింది. కామయ్య ఏదో నిగూఢమైన నవ్వునవ్వాడు. శ్యామల

ప్రక్కకుతొలగిపోయింది. ఇంతలో రంగారావు బయట నుండి వచ్చాడు.

రంగా- బాబాయి! కామయ్య బాబాయి!

కామ- అడుగో వచ్చాడు. పిలవమంటరా ?

జగ- (పలుకడు. ఆలోచిస్తూవుంటాడు.)

కామ- రా! రా! రంగారావు? రా! బయట నుంచున్నావేంరా? (రంగారావు లోపలకొస్తాడు.)

జగ- (కోపాన్ని దిగమ్రింగి) రావయ్యా రంగారావు. అలా పరాయివాడికిమల్లే బయట నిలబడ్డావేం!

కామ- ఓరి తెలివితక్కువ పెద్దమ్మా! నేననగూడదు గాని ఎట్లా బ్రతుకుతావురా? యింత సిగ్గయితే!

రంగా- అదిగాదు బాబాయి (మధ్యలో)

కామ- నీ అవస్థ నాకు మాత్రం తెలియదట్రా! (నవ్వి) నేనన గూడదుగాని, నీ దంతా నీ తాతా పోలికరా. మీ తాతమట్టుకు మీ తాత. వెయ్యితరాలుమారినాఒక్కడు అలాంటివాడు దొరుకుతాడ్రా? ఏం మర్యాదా! ఎంత వినయం, అరే! ఎదటి వాడికి నొప్పి తగల నిచ్చేవాడా!

జగ- (విషపు నవ్వుతో) వాళ్ళ తాత గౌరవాన్ని రంగా రావే నిలబెట్టాలి.

కామ- (నవ్వి) బాగాజెప్పారు. ఈ ఊళ్ళో యిందరు కుర్రాళ్ళున్నారు. వాళ్ళలా అడ్డగాడిదలల్లే ప్రతి దాంట్లో

పెద్దరికం పుచ్చుకోగా మనం ఎప్పుడన్నా చూచామా? (కలిగిన వరకు కలో గంజో త్రాగి, వాడి పనేమిటో! వాడేమిటో! నేననగూడదు గాని, అసలు వీడంటూ ఒకడు ఊళ్ళో వున్నాడని ఎవరన్నా ఎరుగుదురా)?

జగ- మంచి వాడనుపించుకోవటం కష్టం. చెడు వాడనిపించుకోవటానికేంరా! క్షణం సేపు పట్టదు.

రంగా- (సిగ్గుపడుతూ) అదంతా యిప్పుడెందుకు బాబాయి.

కామ- (నవ్వి) నీకక్కరలేక పోయినా మాకు కావాలిగదరా! (నేననగూడదుగాని. మొన్న షావుకారుగారు నువ్వు వెయ్యి రూపాయలు కావాలీ, అనగానే ఎందు కిచ్చాడురా! అదంతా నీ మంచి తనమేరా! పెద్దమ్మా!

రంగా- నేను వెళ్ళాలి బాబాయి త్వరగా)

కామ- (నిట్టూర్చినట్లు నటించి) నేననగూడదుగాని నిష్పాపం లాంటి రైతుబిడ్డవు (నువ్వు తిన్నంతతిని యితర్లకింత పెట్టవలసినవాడవు. నే చెప్పకూడదు కాని, ఎంత ఆస్థి వుంటేనేం, ఎంత యోగ్యతా మంచి తనం వుంటేనేం, అనుభవించే దారిలేక పోయినాక)

జగ- అదేటయ్యా అలా అంటావు?

కామ- (నిట్టూర్చి)ఏమైతేనేంలెండి! కడుపు చింపుకుంటే కాళ్ల మీద పడుతుంది. (నేననగూడదు గాని, నా కొడుకున్నాడు. ఎన్నడన్నా "నాన్నా" అన్న పాపాన పోతాడండి. వాణ్ణితగలెయ్యా! ఏమాటకామాటే చెప్పాలి)

నేను కనపడ్డానంటే బాబాయి, బాబాయి అంటూ పెనవేసుకు తిరుగుతాడు.

జగ- రంగారావుకు యిబ్బంది వచ్చిందంటే మొన్న వెయ్యి రూపాయలు నా ప్రాణంతీసి పట్టుకెళ్ళియిస్తివిగా.

రంగా- ఆ వేళ నా పరువు దక్కించావే బాబాయి.

కామ- మరింక మేము బ్రతికేందుకురా! నేననగూడదు గాని, యివ్వాళమాత్రం దక్కించే వాణ్ణిగాదూ! కాని...

రంగా- (ఆతృతగా) ఏం జరిగింది బాబాయి చెప్పు.

కామ- చెప్పటాని కేముందిరా! మొన్న నేను నీకు డబ్బు యిప్పించి నట్లు మీ నాన్నా. అన్నయ్య వాళ్ళకు తెలిసింది.

రంగా- ఎట్లా తెలిసింది?

జగ- అదే ఆశ్చర్యంగా వుంది.

కామ- నేననగూడదు గాని, మీ నాన్న అన్న మీ షాహుకార్లు నన్నూ అడ్డమైన బూతులు కూశారట.

రంగా- ఎవరి దగ్గరా!

జగ- ఎవరిదగ్గరైతేం! పిల్లనిచ్చనా డబ్బిచ్చనా వగకొని తెచ్చుకోమన్నారు. అంతటితో ఆగారా! ఎన్నిమాట లన్నారు. ఛీ. ఛీ. పోనివ్వండి. ఎవరి కర్మవాళ్ళది.

కామ- నీకు ఆస్తిలో దమ్మిడీ భాగం లేదట?

రంగా- ఎవరంటాడు, (కోపంగా) ఆ మాట!

కామ- నేనన గూడదు గాని, ఎవరో అంటే మనకు ఈ చింతేం దుకురా. మీ నాన్నే అన్నాడట? (నాకు తెలియ కడుగుతాను. యిక్కడ పొలం అమ్మి అక్కడ కొనం గానే స్వార్జితం అవుతుందట్రా)

రంగా- (ఉద్రేకంతో) యిదంతా తన స్వార్జితం అయితే మా తాత సంపాదించిన ఎనిమిదెకరాల కొంద్రేమయింది?

కామ- (నవ్వి) నన్నడుగుతావేరా! తెలివి తక్కువ సన్యాసి. (నేనన గూడదుగాని, నీకంత ధైర్యవుంటే ఈఅప్పాలూ సప్పాలూ చెయ్యటం దేనికి? కాస్త గట్టిగా బ్రతికే షాహుకార్ని నన్నూ బూతులుకూయించటం దేనికిరా! అంతమందికి వుండగా నీకు లేక పోయిందా)

జగ- అలా చేస్తే ఎవ్వరికి ఏ బాధావుండదు. అలా చెయ్య రాదటయ్యా రంగారావు?

రంగా- చేయటానికేంగాని...అంతమంది గుంపు యింట్లో తినే వాళ్ళుండటం వలన యే సంవత్సరం అవేజు ఆ సంవత్స రం యింటిక్రిందే సరిపోతూంది.

కామ- (నెమ్మదిగా) అదేమిట్రా సన్యాసి, అట్లా మాట్లాడు తావు మీ నాన్న పదివేల రూపాయలు నిలువ జేసి నట్లుగా నాకు తెలుసు. (నేననగూడదు గాని, మొన్న మీ చెల్లెలికి వెయ్యి రూపాయలు పెట్టి చంద్రహారం చేయించాడట కదరా)

రంగా- ఏమో నాకేం తెలుసే బాబాయి.

జగ- అవన్నీ ఆ అబ్బాయి నడిగితే అతనేం చెపుతాడు? (నవ్వుతాడు.)

కామ- ఓరి పెద్దమ్మా! యింట్లో ఏం జరుగుతుందో తెలియక పోతే నువ్వెందుకురా! అక్కడ

జగ- (నవ్వి) ఎక్కడన్నా ఒకమ్మాయిని చూచి పెళ్ళి చేయి. అప్పుడే అన్ని ఆరాలు తీస్తూ యింటిపట్టున వుంటాడు.

కామ- అంతవరదాకా ఆ ఆస్థివుంటుందా అని? నేననగూడదు గాని నాకు నమ్మకం లేదు?

జగ- అదేమిటయ్యా? కాస్తా, కూస్తా పదేకరాల కొంద్రా! నిక్షేపంలాంటి భూమి. ఎకరానికి 25 బస్తాల వరకూ పండే మాగనయ్యే. ఎందరు తింటే తరుగుతుంది?

కామ- నేననగూడదు గాని, నాకు తెలిసినంతవరకు వీళ్ళవాళ్ళ పెట్టే ఖర్చు చూస్తే నాకు గుండె పగిలి చస్తానేమో ననిపిస్తుంది.

జగ- వాళ్ళింట్లో అంత విపరీతపు ఖర్చులేమున్నాయి?

కామ- వీడి బావకు అయిదారువేలు పోసి పట్నంలో చదువు చెప్పించాడా? ఆ దిక్కుమాలినఎడ్లకోసం సంవత్సరానికి రెండు వేలు ఖర్చు పెడుతున్నాడా! మన మంతా చెప్పినా వినకుండా కూతురుకు అయిదురోజులు పెళ్ళి

చేశాడా? అల్లుడికి కట్నంక్రింద రెండెకరాల నిక్షేపం, లాంటి మాగాని చదివించాడా? ఏడీ బావ ఊరిని ఉద్ధరించటానికని అడిగితే మొక్క ఆరువందలు గ్రామ పునరుద్ధరణకని దానం చేశాడా! ఎక్కడనుండి వస్తయ్యంటి. మనమేమన్నా జమీందార్లమా! నేననగూడదు గాని నువ్వు ఎట్లా బ్రతుకుతావురా పెద్దమ్మా!)

భీము- (వస్తూ) ఏందండి ఈయన బతికేది? ఈయన బ్రతకాలన్నా ఆళ్ళు బతకనీయొద్దండి. (భీముడి వయస్సు 36 సంవత్సరాలు. నల్లగా తుమ్మమొద్దల్లే వుంటాడు. మట్ట గోచీ, చేతిలో కట్లకర్ర, కోరమీసాలు. భయంకరంగా వుంటాడు.)

కామ- నువ్వు యిట్లా యిల్లూ వాకిలీ అనకుండా ఊరి వెంట తిరిగితే ఎట్లారా? నేననగూడదుగాని, రేపు పెళ్ళయి పిల్లాజెల్లా వుడితే వాళ్ళకు ఎక్కడ తెచ్చిపెడతావురా?

భీము- ఏందండి ఈయన పెట్టేది? యీయనగారికి తింటానికుంటేనా పెళ్ళానికి పెట్టటానికి?

జగ- మీరంతా జేరి ఆ అబ్బాయిని అట్లా వేధిస్తే అతనేం చేస్తాడు?

కామ- (నవ్వి) నేననగూడదు గాని, వాడిని చెడిపోమని చెపుతున్నామా? బాగుపడమంటున్నాం.

భీము- మీరు లక్ష చెప్పండి. ఈయనగారు వాళ్ళ మాటినడని వాళ్ళకు కడుపు మంట.

రంగా- (కోపంతో) వాళ్ళ మాటే వినాలి. ఎందుకూ ఈ చేస్తున్న ముండమోపి పని చాలకనా ?

కామ- నాకు తెలియకడుగుతాను యింతపెద్ద షావుకారు ఒక్క దమ్మిడీ ఖర్చు పెట్టడే. మీనాన్నేం దానకర్ణుడా? ఊళ్లో చదువుకునే బళ్ళకూ, సన్యాసుల మఠాలకూ ధారాపాతంగా ఈ రోజుల్లో డబ్బు విరాళాలు పార వేయటానికి ? (నేననగూడదుగాని, యిప్పుడు నీ చెల్లెలికి చంద్రహారా లెందుకురా ? షావుకారు లాంటివాడు కన్న కూతురుకు ముక్కు పుడుక చేయించటానికి ముందూ వెనకా ఆడుతున్నాడే. యిద్దరు రామ లక్ష్మణుల్లాంటి కొడుకులుంటే నాలుగు చదువు ముక్కలు నేర్పించటం మాని, ఎక్కడో చెల్లెలు కొడుక్కు ఆరువేలు పోసి చదివించాడు- యింక ఏమిట్రా మీ నాన్న మిమ్మల్ని బాగుచేసేది ?)

జగ- ఆ ఆస్థి నరసయ్య స్వార్జితం. అది అతనెలా తగల వేసుకోవటానికైనా హక్కుంది.

కామ- నీకు యింకా అప్పు కావాలంటావు ? ఎవరిస్తారూ ? ఎందుకిస్తారూ ? ఎలాయిస్తారూ ? నాకు తెలియకడుగు

తాను. నేననగూడదు గాని, నీకు ఆస్థి లేకపోతే నువ్వు యెట్లా తీరుస్తావురా?

రంగా- బాబాయి నువ్వు అలా పొరబడతావేం? నీకు తెలుసుగా? యిది మా తండ్రిఆస్తి, మాతాత ఆస్తి.

భీము- ఆయనికి తెలిస్తే ఆర్చేవాడా? తీర్చేవాడా? కందకు లేని దురద చామకా?

కామ- ఓరేయ్ అబ్బాయి నేననగూడదు గాని, అసలు నీకు ముందు ఆస్థిలో భాగం వుందో? లేదో తేల్చుకోరా?

రంగా- (ఉద్రేకంగా) చూస్తావుగా బాబాయి. రేపీపాటికల్లా వాళ్ళంతు తేలుస్తాను.

జగ- తొందరపడితే పనులవుతయ్యా రంగారావు.

భీము- దీపం వుండగానే యిల్లుచక్కపెట్టుకోవాలి. దీపం ఆరింతరువాతేముంటుందిరా.

భీము- అదంతా ఈ పిచ్చిమారాజుకేం తెలుసుద్దండీ. ఏదో వేలకు యింత తిండి తిని తిరిగే ఆయనకి.

రంగా- వస్తా బాబాయి. వస్తా (వెళ్ళాడు రివ్వున)

కామ- ఒరేయ్ రంగారావు. మీ నాన్నా, నేనూ ఒకప్పుడు బాగా బ్రతికాం. మమ్మల్ని బజారుపాలు చెయ్యకురా బాబూ?

2 భీము- దూదిలో నిప్పు పడ్డాక దూలాని కంటుకోకుండా వుంటుందా? నేననగూడదు గాని, (అంతా విరగబడి నవ్వుతారు)

జగ- ఏం ఎత్తు వేశావయ్యా?

1 భీము- తల్లిముండ మొయ్యా! ఆయన అట్టుండాడనా చూత్తాసికి. నొప్పి లేకుండా బతికుండాళ్ళ గుడ్లు దీసే బాపతు కాదండి.

కామ- అఘోరించావు లేరా? అక్కుపక్షి వెధవ. వాడు కొండకు చచ్చేటప్పుడు ఏం జెప్పాను!

జగ- ఏం జెప్పారు?

2 భీము- ఏం జెప్పారేంది! ఆ వాగులో దిగబోయేటప్పుడు బండి కడ్డంపెట్టి బోల్తా కొట్టించమన్నారు.

కామ- మరి ఆ పని చేశారంట్రా? నెననగూడదు గాని చేశారా అంట?

1 భీము- ఎట్టా జేయమంటారండీ? మేము బళ్లు గట్టేసరికే ఆయన ఊరుదాటి పోయె.

కామ- మిణికారులేరా? అడ్డగాడిదల్లే అడ్డెడు బియ్యపుకూడు తినటం తప్ప మీకు ఆవగింజంత తెలివి చచ్చిందిరా!

జగ- వీళ్ళెక్కడింటారయ్యా మనమాట. మనుషులు చూడ

28-8-34

బోతే ఆకలి దప్పిక తేరేటట్లుంటారు.

భీము-2(కోపంతో) ఒక్కడుగులో పోయింది. ఈసారి గుండె లుంటే రమ్మనండి. బరిమీాదకి. మీాసంగల మొగాళ్ళయితే ?

కామ- వెధవ మీాసం. మీాసాలకేమి లేవోయ్. నేననగూడదు గాని, రొయ్యకు లేదూ తెగ బారెడు మీాసం.

జగ- (నవ్వాడు)

భీము-1 (చిన్నబుచ్చుకొని) కామయ్యగారూ ? మీా కైయిత్తం నాదగ్గర చెప్పమాకండి. రోషం తక్కువ మాటలు చెబుతారేంది ? నా బొందిలో ఊపిరుండగా ఆ చంద్రం గోరిని ఏడు చెరువుల నీళ్లు తాగించకపోతే నా పేరు భీమన్నగాదు.

కామ- ఈ పేరులకేంలేవోయ్. మేకపోతు గాంభీర్యం, అంత వరకెందుకురా ! నేననగూడదుగాని, (నెమ్మదిగా) ఏదీ ఈ రాత్రి చూపించు నీ ప్రతాపం.

భీము-2(మీాసం దువ్వి) ఏం జేయమంటారు ?

కామ- నేననగూడదుగాని, ఆ నరసయ్య ఎడ్లకు మందుపెట్టి చంపిరా తెలుస్తుంది నీ పస.

జగ- భలే ! భలే ప్లాను వేశావయ్యా. (సంతోషంతో) ఊ

కానియ్యరా! అది చేస్తే తగినంత బహుమానం తెలిసిందా!

భీము- సరే! కానీయండి. యింత బతుకు బతికి యింకొకకాల జావమని. ఈ రాత్రి జూపిస్తా నా తడాఖా!

జగ- నీ దెబ్బకు తిరుగేముందోయ్.

కామ- ఏనుగంత మనిషివి. కాని బుద్ధిమాత్రం యీగానీఖరీదు లేదురా! నేననగూడదుగాని, పొరపాటున వాడికి దొరికావా! మళ్ళీ పునర్జన్మగూడా వుండదు!

భీము- యియ్యాల జత్తే రేపటికి రెండూ! వుండేం ఊళ్లేలుతున్నాంయేంది! ఆయాలకొండదగ్గర జరిగినపరాభవానికి కత్తెట్టుకుని పొడుచుకు చచ్చేవాణ్ణే! ఎందుకు బతికానంటారండి? సమయం వస్తే చిన్నప్పుడు తాగిన దాంట్లో పసరుగూడా బయటికెల్లాలనే!

కామ- అదీ చూస్తానుకదరా. నేననగూడదుగాని, ఏమంటారండీ షాహుకారుగారూ!

జగ- ఊఁ...కానీయ్యండయ్యా! మీ దెబ్బకు తిరుగేముంది! కామయ్య చెప్పినట్టు కానియ్యరా! గొంగళి పురుగుల్లా నలిగిపోవాలి. ఆ నరసయ్య కుటుంబం కాస్తా (పరీక్షగాజూస్తూ). అదంతా మన భీముడి శక్తిమీద ఆధారపడి వుంది.

భీము- చూస్తారుగా దొరా? భీముడంటే వట్టి పిరికి నాయా లనుకున్నారేమో? (గంభీరంగా ఫోజు పెట్టాడు)

కామ- (నవ్వి) ఎవరన్నార్రా! నీ తాతను నేనెరుగుదును. నీ తండ్రిని, నీ పిన్నబ్బల్ని నేనెరుగుదును. వాళ్ళెంత విశ్వాస పాత్రులూ, ఎంత ధైర్యంకలవాళ్ళు! ఒకసారి ఊళ్ళోవాళ్ళు మీ పిన్నబ్బలమీద తిరగబడ్డారు. వాళ్ళయిదుగురూ కర్రలు తీసుకొని వీధిలోకొచ్చి నిల బడితే ఊళ్ళో యిన్ని వేలమంది జనం కుక్కినపేనుల్లే యిళ్ళల్లోదూరి ఊరుకున్నారనుకో! (నేననగూడదుగాని, వాళ్ళు పంచపాండవుల్లా వుండేవాళ్ళురా! నువ్వు మాత్రం వాళ్ళకు వారసుడవు కావట్రా)? సరే. నువ్వు రాత్రి ప్రొద్దుపోయిన తరువాతరా తెలిసిందా)

భీము- చిత్తం తెలిసిందండి దొరా!

జగ- యిదుగో ఈరెండు రూపాయిలూ పట్టుకెళ్ళి కాశినిసీళ్లు గూడా వుచ్చుకో.

కామ- (నవ్వి) వట్టి సారా త్రాగితేనే ధైర్యం వుంటుందం టూరా! ఒక కోడిపెట్టనుగూడా తింటే యిక అడు గుతా వీడి ప్రతాపం. (నేనగూడదుగాని, యివన్నీ పుచ్చుకొని ఏ కొంపలోనన్నా దూరేవు?)

భీము- (అంతా నవ్వుతారు.) కామయ్యగారి కైత్తం మా బాగా వుంటుందడి.

జగ- యిదుగో ఈ రెండుగూడా తీసుకెళ్లు (యిచ్చాడు).

2 భీము- చిత్తం (తీసుకుంటాడు)

కామ- యిదుగోరోయ్. వట్టి గరుడపక్షిలాగా తిరిగి రావటం గాదు. పని కావాలి తెలిసిందా ?

1 భీము- చిత్తం. చూస్తారుగా !

జగ- యిక వెళ్ళి పెండలాడేరా ? (వెళ్ళాడు దర్జాగా యిద్దరూ నవ్వుకున్నారు. యింతలో శ్యామల బయటికి వచ్చి మంచినీళ్ల గ్లాసు తీసుకెళుతుంది. కామయ్య శ్యామల వంక తీవ్రంగా చూస్తాడు. శ్యామల తల వంచుకొని వెళ్ళిపోతుంది. జగన్నాధరావు ఆశ్చర్యంగా చూస్తాడు.)

జగ- (అనుమానంగా) ఏమిట్రా కామయ్యా అట్లా చూస్తావు?

కామ- ఆ...ఏమీలేదు. అమ్మాయి శ్యామలను గురించే నా ఆలోచన.

జగ- అమ్మాయిని గురించి యింతగా ఆలోచించ వలసిం దేముంది ?

కామ- నేననగూడదుగాని, అమ్మాయి విషయంలో మీరు కాస్త జాగ్రత్త తీసుకోవాలండీ. ఎంతచెడ్డా నీ కుటుం బానికి, నరసయ్య కుటుంబానికి శత సహస్రం తేడా వుందా ? (మీ అంతస్థు ఎక్కడా ! వాళ్ళ అంతస్థు ఎక్కడా ? అమ్మా వాడు గుండెలు తీసిన బంటండి)

జగ- (అర్థంకాక) ఎవడు వాడు? ఏమిటి? చెప్పరాదటయ్యా అట్లా గుడ్లప్పగించి చూస్తావు.

కామ- నేననగూడదుగాని, చూడకుండా ఎలా చెప్పటం. అమ్మాయి ఆ నరసయ్య కోడలుకాబోతుందనేవిన్నాను

జగ- కామయ్యా (కోపంతో)

కామ- నాకు తెలుసు. తమరి అభిమానం అందుకే చెవు తున్నాను. అమ్మాయిని నరసయ్యగారింటికి వెళ్ళ నీయకండి.

జగ- వాళ్ళింటికి మా అమ్మాయి దేనికి వెళుతుంది?

కామ- యింకా దేనికి వెళుతుంది? ఏదో ఆ నరయ్య కూతురు సుశీల స్నేహంకోసం వెళుతున్నట్లుంది. (వ్యంగ్యంగా)

జగ- యిప్పుడదీ లేదుగా?

కామ- లేకపోవటమేమిటి? నేననగూడదుగాని, ఈ పాపిష్టి కళ్ళతో చూచాను. పోనీ. పోతేపోయింది. ఆ దార్భా గ్యుడితో సరసాలేమిటి?

జగ (కోపం పట్టలేక) ఎవడితో?

కామ- ఆ చంద్రంగాడితోనే! నేననగూడదు గాని, ఈ కామయ్య దాపరికం లేనివాడు. కావాలంటే అమ్మా యినే అడగండి!

జగ- (ఆవేశంతో) నిజంగానా ?

కామ- అబద్దం ఆడవలసిన పనేముంది ?

జగ- (కోపంతో) అలాగా! (రివ్వునలేచి) శ్యామలా ?(పెద్దగా) ఎక్కడ జచ్చావే ?

శ్యామ-ఆ...వస్తూన్నా నాన్నా. (త్వరగావచ్చింది)

జగ- నిన్న నువ్వు ఆ నరసయ్యగాడింటికెళ్ళావా ?

శ్యామ- (భయపడిపోయింది)

కామ- (నవ్వుతూ) చెప్పమ్మా ? నాన్న అడుగుతుంటే దాస్తా వెందుకూ ?

జగ- చెప్పవేమే ? అలా దయ్యం పట్టిన దానిలాచూస్తావేం! (కోపంతో లేచాడు)

కామ- మన యింటి వ్యవహారాలు తెలిస్తే అమ్మాయిమాత్రం వెళుతుందా ? నీ అవమానం అమ్మాయికి మాత్రం అవమానంకదూ ? (నేననగూడదుగాని, యింకా చిన్నతనం పాపం)

జగ- (కోపంతో) నీ సోది ఆపవయ్యా ! ఏ మేవెళ్ళావా !

శ్యామ-(కన్నీళ్లు తుడుచుకొంటూ) వెళ్ళాను.

జగ- వెళ్ళావా ? ఎందుకెళ్ళవే ? ఓసి నిన్ను తగలెయ్యా ! నాపరువు తీశావుకదే ? నాకడుపున చెడబుట్టావుకదే ?

(కోపంతో) ఎవరెళ్ళమన్నారు?

కామ- నేననగూడదుగాని వెళితేవెళ్ళావుకాని నువ్వు ఆ చంద్రంతో మాట్లాడటం దేనికమ్మా! నువ్వు చిన్నపిల్లవు కాదుగదా! పెళ్ళి కావలసినదానవు. అదేమన్నా ఆలోచించావా?

జగ- (పళ్ళునూరుతూ) ఆ చంద్రంగాడితో మాట్లాడావా?

శ్యామ-(భయంతో) మాట్లాడాను!

జగ- (అదరిపడి) మాట్లాడావా? ఓసి దిక్కుమాలినముండా! ఛీ. నీజన్మ తగలెయ్యా!

కామ- నేను చెప్పగూడదుగాని, యింకా పెద్దవాళ్ళం మేము బ్రతికేవున్నామా? డబ్బు, దర్పం, అంతస్థులూ-భేధం వుండనే వున్నయ్యా? నాన్న వుండగానే పెళ్ళిగాక ముందే నువ్వు ఆ చంద్రాన్ని ప్రేమించటమేమిటమ్మా?

శ్యామ- తప్పేముంది?

జగ- (చెంపపగిలేటట్లు కొట్టాడు) తప్పులేదూ? ఎంత తెగించావే! యివ్వాళ నిన్ను నరికి పోగులేస్తాను.

కామ- (నవ్వి) నువ్వు ప్రేమించటమేనుటమ్మాయి, యింక పదహారేళ్ళన్నా నిండలేదు. నేను నమ్మలేను. వాడునిన్ను మోసంచేశాడు. (నేననగూడదుగాని. నువ్వు ఆ మోసంలో పడ్డావు)

జగ- ఇంకాఎందుకు బ్రతికావే? దిక్కుమాలినముండా! పద, లోపలికి పద. నువ్వు నాచేతిలో యివ్వాళ చచ్చావులే పద.

కామ- (అడ్డమెళ్తాడు. జగన్నాధరావు నెట్టిపారవేస్తాడు.) యిదిగో షావుకారుగారు. నామాట వినండి. చిన్న పిల్ల. ఈసారికి విడిచిపెట్టండి. నేననగూడదుగాని అమ్మాయి తప్పేముంది? ఆ దుర్మార్గుడే మోసం చేశాడు. లేకపోతే ఈ యీడుకు ప్రేమేమిటి? పత్తి కట్టేమిటి? యింతవరకు ఆ ప్రేమేమిటో నాకు తెలిసి చావలేదు.

శ్యామ-నాన్నా...నాన్నా...

జగ- నాన్నా (పళ్ళుకొరికి) రా! లోపలికిరా! (బటబటా లోపలకు లాక్కువెళతాడు. లోపల శ్యామలఏడ్పులూ జగన్నాధరావుకొట్టిన దెబ్బలూ, ఆవేశపడటం వినిపిస్తుంది.) యిక వెళ్ళవుగా? నిన్ను తప్పిస్తాతేస్తాను. జాగ్రత్తా!

శ్యామ- వెళ్ళను, వెళ్ళను నాన్నా. అమ్మో! నాన్నా! చంపకు, చంపకు నాన్నా! (కామయ్య పెద్దగా నవ్వుతూ బయటకు. వెళుతుంటాడు (తెర)

# "రైతు బిడ్డలు"

## మూడవరంగం

(తెర)

సీను- (అది నరసయ్యగారిల్లు - అంతా వెనకటి సీనే - సుశీల బయటనుండి ఆందోళనగా ఏడుపు ముఖంతో వస్తుంది. చంద్రం లోపలనుండి బయటకు వెళ్ళిపోతుంటాడు)

సుశీ- అన్నయ్యా! మొన్న రాత్రే! (ఆగిపోతుంది)

చంద్రం-ఊఁ...ఏమైయింది?

సుశీ- శ్యామలను వాళ్ళనాన్న కొట్టాడట?

చంద్రం- దేనికి?

సుశీ- మనయింటికి వచ్చిందని చావచితక కొట్టాడట! పాపం తల పగిలిందట! నిన్నల్లా అన్నంతినలేదట. (కన్నీళ్లు తుడుచుకొంది.)

చంద్రం- హుఁ. అలాగా! (నిట్టూర్చాడు బరువుగా)

సుశీ- యికనెప్పటికీ మనయింటికి వెళ్ళొద్దన్నాడటన్నయ్యా! (దిగులుగా)

చంద్రం- సరే! (బాధగా బయటకు వెళ్ళిపోయాడు. సుశీల లోపలకు వెళ్ళిపోయింది. నరసయ్య లోపలనుండివచ్చి మంచంవాల్చుకునికూర్చున్నాడు. ఇంతలో రాఘవయ్య

వచ్చాడు. చుట్ట కాలుస్తూను.)

రాఘు- పంట్లో ఎలావుందే నరసయ్యన్నా !

నర- యివ్వాళ కాస్త కులాసాగానేవుందిరా! రాత్రికాస్త జ్వరంతగిలిందిగాని, వెంటనే తగ్గిపోయింది.

రాఘు- ఈ సంవత్సరం ఏయింట్లో చూచినా ఒకటే రోగాలే నరసయ్యన్నా ! ఏం జ్వరాలేయివి. వట్టి విషజ్వరాలై పోయినై.

నర- గాలిపాటు సరిగా లేదన్నాడు. రాత్రి వైద్యుడు.

రాఘు- అదిసరేగాని, రాత్రియేమిటీ దొడ్లో గోల జరిగిందట ?

నర- ఆ...ఏముందిరా ! నేను పన్నెండుగంటలప్పుడు గొడ్లకు మేత వెయ్యటానికని చావిట్లోకెళ్ళాను. ఇంకా నిలగూక లేదు. గొడ్లకు మేత వేస్తున్నాను. మా ఎడ్లగాట్లో ఎవడో పడుకునివున్నాడు. ఎడ్లు బుసలుకొడుతున్నయ్ నేను ఏమిటోనని దగ్గరకెళ్ళితినిగదా, యింకేముంది? ఎవడో తుమ్మమొద్దల్లేవున్నాడు. నన్ను అమాంతంగా పడనెట్టి పారిపోయాడు.

రాఘు- చేతిలో కర్ర లేదూ ?

నర- చావిట్లోకంటా తీసుకువెళ్ళి అక్కడ గోడకానించాను. చేతిలోవుంటే ఒక్క దెబ్బకు పడుకోబెట్టేవాడినే!

రాఘు- అసలు వాడెందుకొచ్చి నట్లంటావు?

నర- ఆ...ఎందుకొస్తాడురా! దొడ్లో ఎప్పుడూ ఏదో ఒకటి పోతూనే వుంటుందా? వాడేదో యెత్తుకెళ్ళటానికే వచ్చివుంటాడు.

రాఘు- ఓరి వాడితల్లీసిగ్గొయ్యా? యింతకూ యేమీ పోలేదు కదా?

నర- యేమీపోలేదు.

రాఘు- నాకప్పుడే నిద్రపడుతుంది. నిన్నల్లా ఆ గరువుదిబ్బదున్ని వచ్చేటప్పటికే వల్లంతా పులిసిందేమో? యెంతకూ నిద్రపట్టలా! నువ్వు అరిచేటప్పటికి నాకు మతిపోయిందనుకో! యింతకూ తల్లిశిగతరగ వాడీరోజులుబాగుండిపోయినైలే! (సత్యంవచ్చాడు)

సత్యం- మామయ్యా నన్ను కరణంగారు రమ్మన్నారు.

నర- యెక్కడున్నాడురా?

సత్యం- ఇప్పుడే యింటికి వెళ్ళాడు.

రాఘు- దేనికే నరసయ్యన్నా?

నర- అదేరా! ఆతాళ్ళతోపుదగ్గర ఖాళీస్థలం అమ్మాననుగా? అది కొలిపించాలి.

రాఘు- నేనూ ఆ మాదిగ వెంకడింటికి వెళ్ళిరావాలిపద. వాడి

తల్లిశిగ్గోయ్యా! పదిరోజులనాడు బండి పట్టిఖర్చుయిస్తే యింతవరకూ యివ్వడే నరసయ్యన్నా!

[ఇద్దరూ లేచారు వెళ్ళటానికి. సత్యం లోపలకువెళ్ళి పోయాడు. బయటనుండి రంగారావువచ్చాడు. ముఖం ఎర్రబడివుంది. రంగారావుని చూడగనే నరసయ్యముఖం ప్రక్కకు త్రిప్పుకున్నాడు. రంగారావు కోపంతో]

రంగా- యిదిగో! రాఘువయ్య బాబాయి. ఒకమాటాగు

రాఘు- (ఆగి) ఏమిట్రా! రంగారావు

నర- రా రా వెళదాం!

రంగా- కాదులే! వుండు బాబాయి.

రాఘు- దేనికిరా?

రంగా- నాకోక నాలుగొందల రూపాయలు కావాలి. ఇస్తాడో లేదో అడుగు.

నర- (పోతున్నవాడల్లా ఆగి కోపంతోచూస్తాడు)

రంగా- అడగవే బాబాయి. నాకు అర్జంటుగా కావాలి.

రాఘు- దేనికిరా? నాతో చెప్పగూడదూ!

రంగా- అది తరువాత చెపుతాగా!

రాఘు- ఏం, నరసయ్యన్నా.

నర- ఎవడిదగ్గరున్నయిరా! నాలుగొందలు. నాదగ్గరలేవు యిప్పుడు.

రంగా- (కోపంతో) అందరికీ యివ్వటానికి వుండగాలేంది. నా కివ్వటానికి వుండ వేం? బాబాయి.

రాఘు- అది నన్నడుగుతావేంరా! దగ్గరున్నాడుగా, మీనాన్ననే అడగరాదూ!

రంగా- ఎవరినడిగితేం లేం,

నర- నాదగ్గర చిల్లిగవ్వైడీలేదని చెప్పరా!

రంగా- నాకవసరంగా కావాలనిచెప్పు బాబాయి.

రాఘు- (బిత్తరపోతాడు)

రంగా- అలా చూస్తావేమిటి బాబాయి. యివ్వాళ నాలుగొందల రూపాయలివ్వకపోతే బాగుండదు.

నర- ఒక్కదమ్మిడీ నాదగ్గర తీసుకోలేడని చెప్పరా! (ఉద్రేకంగా)

రాఘు- ఏమిట్రా రంగారావు! ఏమిటిది?

రంగా- యిదంతా మోసుకు బాబాయి. నా ఆస్థి మర్యాదగా నాకు పంచమను!

నర- (కోపంతో) ఈ ముండ సంపాదించిందివుంటే పంచుకెళ్ళమనరా!

రాఘు- నరసయన్నా! నువ్వు తొందరపడతావేం! ఓరేయ్ రంగారావు. దేనికిరా యీ అల్లరి. నలుగురూ వింటే ఏమంటార్రా?

రంగా- ఎవరో వింటారని ఊరుకోబట్టే యిలా అయింది.

రాఘు- ఏమయిందిరా?

నర- (రోషంతో) బెదరిస్తాడట్రా! బెదరించి నాదగ్గర ఒక్క చిల్లిగవ్వైనా తీసుకుంటాడూ? సిగ్గూ సెరం లేకుండా అడ్డగాడిదల్లే ఊరిమీదతిరిగి, చెడుస్నేహాలు పట్టింది చాలక. బెదరిస్తాడు? ఒరేయ్ రాఘువయ్యా! వాడసలు నాకు పుట్టలేదనుకన్నాను. మానమర్యాదలు పోయిన తర్వాత వీడిజన్మ తగలెయ్యా చచ్చేం బ్రతికేంరా!

రంగా- (కోపంగా) ఈ వాగుడంతా నాకనవసరం నాకు కావల సిందల్లా డబ్బు, లేకపోతే నాభాగం ఆస్తి నాకుపంచ మను. అంతే! యివ్వాళతో అటో యిటో తేలాలి.

రాఘు- నామాట వినరా! రంగారావు

రంగా- నన్నుదేనికి బలవంతంపెడతా బాబాయి. యిక యీముండ మోపికొంపలో ఒక్కక్షణంవుండను.

నర- అసలు వుండమని ఏడ్చిందెవర్రా? వెళ్ళమను. యిక మనముఖం వాడికీ, వాడిముఖం మనకూ చూపించ వద్దనిచెప్పు!

రంగా- యిలాంటి పాపిష్టిముఖాలు చూడాలని యేడ్చిం దెవరూ? నాఆస్థి నాకు పంచమను.

నర- నాగొంతులో ఊపిరుండగా ఒక్కదమ్మిడీ పంచను. పద్యం

రంగా- అట్టాగా! నీ అంతు తేలుస్తాను.

నర- ఏమిట్రా ముండా? నువ్వు చేసేది! నువ్వు చచ్చి పిడికెడు బూడిదైనా ఒక్క ఎర్రని యాగానీయివ్వను. పో! నా యింట్లోనుండి

రంగా- (కోపంతో) నీ యిల్లూ!

రాఘు- రంగారావు! నలుగురూ వింటార్రా! ఊరుకోరా! నగనయ్యన్నా!......... పద్య

రంగా- మా బ్రతుకు నలుగురూ ఏనాడో విన్నారు. (యింతలో సుశీలా, సత్యం వస్తారు)

సుశీ- ఏమిటన్నయ్యా యిది? నాన్నకు అసలే ఒంట్లో బాగుండ లేదు. ఆయన మనస్సుని దేనికి అట్లా పాడు చేస్తావు?

రంగా- (వ్యంగ్యంగా) ఔను, ఆయన ఆరోగ్యంచెడిపోతే నాకు చంద్రహారాలు చేయించడనా, పట్టుబట్టలుపెట్టడా?

సుశీ- యిప్పుడు నిన్ను కాదని నేనేంతింటున్నాను.

నర- అమ్మాయి నువ్వు యింట్లోకెళ్ళమ్మా!

రాఘు- నువ్వు ఊరుకోమ్మాయి.

సుశీ- (విచారంగా) అదికాదు బాబాయి. నాన్న నాకు చంద్రహారం చేయించాడనేగా అన్నాయికికోపం? (మెడలో నుండి తీసి) యిదిగో కావాలంటే తీసుకువెళ్ళి అమ్ముకోండి!

నర- నువ్వెందుకే ఏడుస్తావు? నాకిష్టమైంది. నేను చేయించాను. ఈ ముండసంపాదించింది నేనేంఖర్చుపెట్టలేదు.

రంగా- వింటున్నావుగా బాబాయి.

సత్యం- బావా! నామాటవిను.

రంగా- విన్నాంలేవోయ్, పెద్దన్యాయస్తుడివి బయలుదేరావు. చేసుకున్న పెళ్ళానికి తిండిపెట్టలేక కొంపలమ్మేటు వూటకూళ్ళు తింటున్నాడూ? ఈయనగారు ఊరుని ఉద్ధరిస్తాడట?

సుశీ- (కోపంతో) అన్నయ్యా!

సత్యం- (అవమానంగా) సుశీ! అదేంలాభంలేదు ఊరుకో! తప్పంతానాదే! వాళ్ళనని ప్రయోజనంలేదు. యింతవరకూ వాళ్ళఅభిమానంతో యిక్కడుంటున్నామనుకున్నాం. కాని వాళ్ళకు కష్టంకలిగించేవిధంగా మనం యిక్కడెందుకుండాలి?

నర- సత్యం

రాఘు- చదువుకున్నవాడివి నువ్వుగూడా అలా తొందరపడితే ఎలాగురా సత్యం?

సత్యం- పరిస్థితులు మనల్ని దాటిపోయినాకగూడా యింకా తొందరపడవద్దంటావేం? మామయ్యా!

సుశీ- (ఏడుస్తూ) మాకుమాత్రం చీమూ నెత్తురూలేవా? బాబాయి. ఆడపిల్లకు అత్తవారిల్లే పుట్టిల్లంటా రందు కనే, అన్నయ్యా! నీదేమీతప్పులేదు. అంతా మాదే తప్పు? నీకు కోపంవస్తుందనుకుంటే ఏనాడో వెళ్ళిపోయే వాళ్ళం? నీతోపాటు నేను మగపుటకపుడితే నువ్వు యిలా అనగలవా! నేనూ ఆస్తిలోసగం పంచుకునే దాన్నేగా? రెండుపూటలు తింటానికే నోచుకోలేక పోయాను.

రంగా- యిదేం ధర్మసత్రంగాదు. మీరంతా సంవత్సరాల తర బడి పడితింటానికి, యిదిగో! రాఘవయ్యబాబాయి. నేను నిజంగానే చెపుతున్నాను. ఈ భాగాలపంపిణీ తెగే వరకూ, ఈ యింట్లో వుంటానికిగాని, తింటానికిగానీ, ఎవ్వరికీ అధికారంలేదు. జాగ్రత్త! మళ్ళీచెపుతున్నాను ఇది నాయిల్లు. యిందులో నాకు భాగంవుంది. ఈ దెబ్బతో చావో, బ్రతుకో తేలాలి, యికనుండి ఎవరి దారి వాళ్ళుచూచుకోవటం మంచిది. (రివ్వున బయ టకు వెళ్ళిపోయాడు నరసయ్య మంచంలో కూల

బద్దాడు. రాఘవయ్య శిలాప్రతిమయ్యాడు. సత్యం అవమానంతో క్రుంగిపోయాడు. సుశీల దుఃఖంతో కూలిపోయింది )

సత్యం- సుశీ, మనపెట్టెలూ? బట్టలూనద్దు వెళ్ళిపోదాం.

నర- (విచారంగా) సత్యం

రాఘు- సత్యం, పట్టుపట్టుమని యిప్పుడెక్కడ కెళతార్రా ?

సుశీ- బాబాయి. ఈయింటివిషయాలు చాలదూరంవెళ్ళాయి. యిక మేముండటంవలన ఈ యింటికి ఏ ఆపదలొచ్చినా అవి మానెత్తిమీదపడతయ్యి, వాడిచేత మేము మెడ బట్టి గెంటించుకునేదాకా దేనికుండాలి ? బాబాయి. యిప్పటికే ఆత్మగౌరవం నాశనంచేసుకున్నాం ?

(ఏడుస్తూ)

నర- (దుఃఖంతో) సుశీ...

సుశీ- నామాటకు అడ్డుచెప్పకు నాన్నా !

నర- ఈ వృద్ధాప్యంలో నువ్వుగూడా నన్నువిడిచి వెళ్ళిపోతావా ? తల్లీ ? తల్లిలేకపోయినా నిన్ను యింతవరకూ ఎంతో అల్లారుముద్దుగాపెంచి పెద్దదాన్నిచేశాను. మీరే నా జీవితానికి వేగుచుక్కలను కున్నాను. మీపైననే నా సర్వఆశలూ పెట్టుకుని జీవించాను. నన్ను

మీరుగూడా ఈ దిక్కులేనిస్థితిలో విడిచివెళ్ళిపోతారా, తల్లీ !

సుశీ- అదికాదునాన్నా ! (చెప్పలేకపోతుంది)

సత్యం- నిన్నుకష్టపెట్టటం మావుద్దేశ్యంకాదు. మామయ్యా ! రేపు ఈసంసారానికి ఏదొచ్చినా మేము అపనిందలపాలవుతాము (కన్నీళ్ళు తుడుచుకుంటూ) నువ్వుచెప్పు రాఘవయ్యమావా ? (సుశీల లోపలకు వెళ్ళిపోతుంది)

రాఘ- నిజమేరాసత్యం, (విచారంగా) నువ్వు చదుకున్నవాడివి. నీకు నేను చెప్పాలట్రా ? నువ్వువచ్చిన తరువాతనే ఈ ఊరూ, ఈ ఇల్లూ. అంతాబాగుపడి, నాలుగు విషయాలు నేర్చుకున్నాం మేము, కాని యిప్పుడు మీరు మాత్రం యెక్కడికి వెళతారు ?

సత్యం- ఏదో ? మావయ్య దయవలన చెప్పించిన విద్యాబుద్ధులున్నాయి. ఎక్కడన్నా ఉద్యోగంచేసుకుంటే పదిరాళ్లు సంపాదించుకుంటాను. కాస్తమేము ఒకచోట నిలబడ్డ తరువాత నిన్నుమాదగ్గరకు తీసుకువెళతాంలే మావయ్యా !

రాఘ- ఎంత చల్లనిమాట చెప్పావురా ! నరసయ్యన్నా, ఇంకా నువ్వు విచారించేదెందుకూ ?

నర- అదికాదురా, నేను యింతకాలం దేనికిబ్రతకాలి ? నా

యిల్లాలుపోయిననాడే నేనూ చచ్చిపోతే యివ్వాళ ఈ దుర్మార్గంచూడకుండా పొయ్యేవాడినేగా? నన్ను భగవంతుడు ఏంచేయమని యింతకాలం బ్రతికించాడో?

సత్యం- అదేమిటి మావయ్యా! నువ్వుగూడా అలా అధైర్య పడిపోతే ఎట్లా? కష్టాలు కలకాలం వుంటయ్యా!

నర- కష్టాలు,! ఎన్నికష్టాల్ని, ఎంతదుఃఖాన్నిభరించి దిగ మ్రింగానో ఎవరికి తెలుస్తుంది?

రాఘు- సత్యం, నేను ఒక్కటి చెపుతాగాని వింటావట్రా! నువ్వుయిప్పుడు పట్టుపట్టుమని యెక్కడికి పరుగిడ తావురా? నీకభ్యంతరం లేకపోతే ఊరిమధ్యనున్న మాపాతయింట్లో కొంతకాలంవుండరా? కొంతకాలం పోతే, పరిస్థితులు నెమ్మదించినాక చూచుకోవచ్చు, నీకు యిష్టమేనట్రా?

సత్యం- సరేలే, మావయ్యా! ఈ యిల్లుకాకుండా వుంటేసరి!

నర- రాఘవయ్యా! యిప్పుడు వాళ్ళకు నువ్వేదిక్కురా! వాళ్ళకాయిల్లు బాగుచేయించియివ్వు. మిడిమేళంగా వెళ్ళి వాళ్ళెక్కడ అవస్థలు పడతార్రా?

రాఘు- నువ్వుఊరుకో నరసయ్యన్నా! సత్యానికొచ్చిన భయం లేదు. నేనున్నాగా! ఆ. బజారుకెళ్ళేపనే మరచిపో యాము. వెళదాం వస్తావటే నరసయ్యన్నా!

నర- పదరా! వెళ్ళివద్దాం? (యిద్దరూలేచి వెళ్ళిపోతారు విచారంగా. సత్యంగూడా బయటకు వెళ్ళిపోతాడు. చంద్రంవస్తాడు. సుశీలలోపలినుండి విచారంగావస్తుంది. చంద్రంచూచి ఆశ్చర్యపోతాడు.)

చంద్రం- ఏమిటమ్మా సుశీ అలావున్నావు?

సుశీ- (చెప్పలేక కన్నీళ్ళు విడుస్తుంది.)

చంద్రం- అదేమిటమ్మా! దేనికి ఏడుస్తావు? నాన్న ఏమన్నా అన్నాడా?

సుశీ- అన్నయ్యా! (ఏడుస్తుంది)

చంద్రం- (అర్థంకాక) ఏం జరిగింది? నాతో చెప్పటానికేం? అబ్బే! ఏమిటా ఏడవటం? (కన్నీళ్లుతుడుస్తాడు.)

సుశీ- చిన్నాన్నాయీ, నాన్నా పోట్లాడుకున్నారు.

చంద్రం- ఎప్పుడూ? (ఆశ్చర్యంగా)

సుశీ- యిప్పుడే! (కన్నీళ్ళుతుడుచుకుంటూ)

చంద్రం- వాళ్ళిద్దరూ పోట్లాడుకుంటే నువ్వేమేడవటం దేనికి?

సుశీ- మేముగూడా యిక్కడనుండి వెళ్ళిపోతా మన్నయ్యా!

చంద్రం- మీరా! ఎవరెవరూ? దేనికి?

సుశీ- చిన్నాన్నాయి, బావను చాలామాటలన్నాడు. మేము

గతిలేక మీాయింట్లో పూటకూళ్లు తింటున్నావట? అదంతా యిప్పుడెందుకులే అన్నయ్యా! ఎప్పటికైనా మేము వెళ్ళవలసిన వాళ్ళమేగా?

చంద్రం- ఈభాగ్యానికేనా? నేను కనుక్కుంటానుగా ఊరుకో! వాడికేనా! నాకుమాత్రం యిల్లులేదూ! (యింతలో తెరలో నరసయ్యనౌకరు కోటిగాడు పరుగెత్తుకుంటూ వస్తాడు)

కోటి- చంద్రయ్యగోరూ! చంద్రయ్యగోరూ!

చంద్రం- (అదరిపడి) ఎవరూ?

కోటి- నేనండీ కోటిగాడిని.

చంద్రం- (లేచి) ఏమిట్రా! ఏమిటీ!

కోటి- చిన్నదొరగారు ఆ పాలబట్ల ఎద్దుని తోలుకెళ్ళి ఆ కామయ్యగారింటికాడ అమ్ముకుంటున్నాడు దొరా!

చంద్రం- నిజమేనా?

కోటి- నిజమేనండిదొరా! నేను పొలాన్నుండి గడ్డిమోపు తెచ్చేసరికి గాటిని ఎద్దులేదు. దీనివడిచావ, ఊడదీసుకుపోయిందేమోనసీ ఎతకటానికెల్లా? యింకేముందీ ఆ కామయ్యగారి దొడ్లోవుంది. పోయిచూద్దునుగందా చిన్నదొరగారు డబ్బుతీసుకుంటున్నారు. నేను అడగబోతే కఱ్ఱతీసుకుని నావెంటపడ్డాడండీ?

చంద్రం- సరే! పో! (నౌకరు వెళ్ళిపోయాడు. చంద్రం మంచం మీాద కూలబడ్డాడు, ముఖం ఎర్రబడింగి, ఉద్రేకంతో రివ్వునలేచాడు. మూలనున్న ముల్లుకర్రతీసుకుని వెళ్ళ బోయాడు. సుశీల పెద్దగా అరుస్తూ అడ్డువచ్చింది.)

సుశీ- అన్నయ్యా? అన్నయ్యా?

చంద్రం- లే, అడ్డులే, ఈవేళ వాడిచావో? నాచావో తేలిపో తుంది. యిన్ని జరిగినాక బ్రతికేం చచ్చేం?

సుశీ- అన్నయ్యా! నామాట విసన్నయ్యా! (ఏడుస్తూ)

చంద్రం- సుశీ, నన్ను ఆపకు, యిలాగనే వాడి నీస్థితికి తెచ్చాం! ఒక్కసారి కాలో, చెయ్యోవిరిచివేస్తే చచ్చినట్లుపడి వుంటాడు.

సుశీ- వాడు నీయంతవాడయ్యాడు. నువ్వు యిప్పుడలాచేస్తే లోకం మెచ్చదన్నయ్యా!

చంద్రం- (రోషంతో) అవంతా మించిపోయింది. వదులు. వదులుతావా లేదా! సుశీ (అరిచాడు)

సుశీ- (గంభీరంగా) అన్న య్యా! వాణ్ణిచంపేముందు నన్ను చంపి మరీవెళ్ళు.

చంద్రం- సుశీ...(పెద్దగా అరిచాడు మళ్ళీ)

సుశీ- ఔనన్నయ్యా! నువ్వు నన్నుచంపిమరీవెళ్లు.

నువ్వుతొందరపడితే మనసంసారం బజారుకెక్కుతుంది. ఒక్కటాలోచించన్నయ్యా! నువ్వువాణ్ణిచంపివే స్తేలోకం ఏమంటారు? ఆస్థికోసం వాణ్ణిమనం చంపామటుంది నరు! నిజానిజాలు లోకానికి తెలియవు. (కాళ్ళుపట్టు కొని) అమ్మకడుపున మనముగ్గురం పుట్టాము. అమ్మ కడుపులో చిచ్చుపెట్టకన్నయ్యా! మనకులుంబాన్ని నిందలపాలు చేయకన్నయ్యా! వాడిపద్ధతులు మనకు నచ్చకపోతే మనం దూరంగావుందాం? లోకంమెచ్చద న్నయ్యా! ఈనింద నాకొస్తుంది. (ఉద్రేకంతో) మీా కంత కొట్టుకోవాలనివుంటే నేనీయింట్లోవుండగా మాత్రం వీల్లేదు.

చంద్రం- (కత్రజారి క్రిందపడిపోయింది ఆవేశం తగ్గిపోయింది. మంచంమీాద కూలబడ్డాడు. ముఖంచేతులతో కప్పు కున్నాడు. కళ్ళవెంట నిప్పులకుబదులు నీళ్ళువచ్చాయి) ఏంపనిచేశావే సుశీ...ఛీ...వెధవబ్రతుకు. ఆ ఎద్దను యెంతప్రాణంగామేపాను. అవి మనయింటికి యెంతటి పేరు ప్రతిష్టలు తెచ్చినై, (యింతలో రంగారావే వచ్చాడు నోటితో ఈలపాట పాడుకుంటూను. సుశీల వెళ్ళిపొమ్మని సైగచేసింది. కాని, అదిపట్టించుకున్నట్లు లేదు. సరాసరి దర్జాగా లోపలికొచ్చాడు. చంద్రానికి ఆవేశం మళ్ళీపొంగింది సుశీల వణికిపోతుంది.)

చంద్రం- ఎద్దేమైయిందిరా?

రంగా- (నిర్లక్ష్యంగా) అమ్మేశాను.

చంద్రం- (ముఖం ఎర్రబడింది) యెవరినడిగి!

రంగా- నాయిష్టంమీాదనే! (గంభీరంగా)

చంద్రం- నీయిష్టంమీాదనేనా?

రంగా- (రెట్టిస్తూ) ఔను

చంద్రం- ఎందుకమ్మావురా?

సుశీ- అన్నయ్యా!

చంద్రం- (కోపంగా) నువ్వూరుకో సుశీ, ఎందుకమ్మావురా!

రంగా- నాకు డబ్బుఅవసరముండి.

చంద్రం- గడ్డితినకపోయావు?

రంగా- (పలుకడు)

చంద్రం- ఎవరినడిగమ్మావు! పలుకవేం?

రంగా- (కోపంతో) చెప్పాను. నాయిష్టమేనని!

చంద్రం- నీపెత్తనమేనన్నమాట?

రంగా- ఔను. నాఆస్థిమీాద నాపెత్తనంలేకపోతే, యింకెవరి కుంటుంది? నువ్వెవ్వడివి అడగటానికి?

చంద్రం- అంత బరితెగిపోయావన్నమాట?

రంగా- మిమ్మల్నిబట్టే!...

చంద్రం- ఆ...మాదర్చోద (లేచాడు పెటపెటా గూబపగిలే

టట్లుగా కొట్టాడు. ఆవేశంలో రొప్పుతూవుంటాడు. సుశీల భయంతో లోపలికి పారిపోయింది.)

చంద్రం- తిత్తితీస్తాను. జాగ్రత్త! ఛీ. వెధవబ్రతుకు. ఎందుకురా ఏళ్లొచ్చినై, నీపుటక తగలెయ్యా! (ఆగలేక లోపలకు వెళ్ళిపోబోతూవుంటాడు. రంగారావు నిశ్శబ్దంగా నలువైపులాచూచాడు. (ప్రక్కనున్న ముల్లుకర్ర తీసుకుంటున్నాడు. యింతలో నరసయ్య బయటనుండివచ్చి చూచి కంగారుపడ్డాడు. రంగారావు రోషంతో వుండటం గమనించాడు. చంద్రాన్ని కొట్టబోతున్నాడని గ్రహించాడు. ఆవేశంతో)

నర- ఏమిట్రా! అది? ఒరేయ్ రంగడూ? (పెద్దగాఅరుస్తూ మధ్యకు పరుగెత్తాడు. రంగారావు కర్ర విసురుగావెళ్ళి బలంగా నరసయ్య తలమీదపడింది. "అమ్మా" అంటూ క్రింద పడిపోయాడు. రక్తంలో మునిగిపోయాడు. చంద్రం పోతున్నవాడల్లా వెనుదిరిగిచూచి తండ్రినిపట్టుకున్నాడు. రంగారావు కర్రక్రిందపారవేసి నిశ్శబ్దంగా బయటకు వెళ్ళిపోయాడు. సుశీలవచ్చిచూచి కెవ్వున కేకవేసింది.

చంద్రం- నాన్నా...నాన్నా...(క్రిందపడ్డ కర్రతీసుకుని బయటికి పరుగెత్తాడు. సుశీల అన్నయ్యా! అంటూ అరిచింది.)

(తెర)

# "రైతు బిడ్డలు"

## నాలుగవ రంగం

[ తెర ]

సీను– (అది నరసయ్యగారి యిల్లు. అంతా వెనుకటిమాదిరి గానే వుంటుంది. బయటనుంచి చంద్రంవస్తాడు. బయట నుండి పాటవినుపిస్తుంది.)

పాట

ఈ బ్రతుకులే యింతేనురన్నా
మన బాధలకు అంతమేదన్నా ॥
మనిషి మనిషికిమధ్య
మమతలే త్రెంచుకొని
శోకిస్తె ఏముందిరా
లోకమేయింతేనురా ? ॥ ఈ॥
అన్నపై తమ్మునికి
అనుమానమేరన్నా
తండ్రిపై కొడుకుకి
తగని ద్వేషంబన్నా
గుండె గుండెకుమధ్య
ఘోషించు ద్వేషాలు
ఆగిపోయే దెన్నడన్నా -మన
ఆత్మలకు శాంతిలేదన్నా ॥ ఈ॥

(యింతలో నరసయ్యగారి పాలేరు కోటిగాడువస్తాడు)

కోటి- చంద్రయ్యగోరూ

చంద్రం- (తలెత్తి) ఏమిట్రా!

కోటి- ఆ పాడిగేదలు అల్లాడి చత్తున్నయ్యండి

చంద్రం- దేనికి!

కోటి- ఆటిని నిన్నా యియ్యాలా పాలుదీసినాళ్ళే లేరండి.

చంద్రం- ఓ...అదా! (నిట్టూర్చాడు)

కోటి- పాడిగేదలు కట్టుగొయ్యలదగ్గర అల్లాడిచత్తున్నయ్యండి

చంద్రం- నేనేం చేసేదిరా!

కోటి- అట్టాగంటే ఎట్టాగండీదొరా? చిన్నప్పుడునుండీ ఆ గొడ్డూగోదా మంచిచెడ్డల్ని చూత్తుంది మీరేనయ్యె! పెద్దదొరగారు మంచంపట్టిరి. చిన్నదొరగారు ఈసంను కైనాతొంగిచూడ్డాయే, ఆదొరసానెమ్మగారు ఊరిమధ్య కెళ్ళిపోయిరి. అంతా అట్టాగంటే ఎట్టాగండీదొరా?

చంద్రం- (విసుగ్గా) ఏమిటీసోది?

కోటి- నిన్నల్లా పాలుతియ్యకపోతిరి. యియ్యాలన్నా ఆటి ముఖం చూసినాళ్ళు లేకపోయిరి. పొద్దుగూకొత్తుంది. ఆగేదలు రెండూ కట్టుగొయ్యలదగ్గర గోడలుపగిలే టట్లు అరిచిచత్తుండయ్యండి

చంద్రం- చస్తే చావనీయి. అందరిపీడా విరగడైపోతుంది.

కోటి- ఆ లేగదూడలు సిన్నల్లా అరచి అరచి యియ్యాలఅడ్డం పడిపోయినైయండి. ఆ పాడిగేదలు తాళ్లు త్రెంపుకు పోతున్నయి.

చంద్రం—వెళ్ళి ఆదూడల్ని పాలకువదలిపెట్టు. అవ్వయినా త్రాగి బ్రతుకుతై.

కోటి- ఆపాలన్నీ అయ్యోక్కడ తాగిచత్తయ్యండి. ఒక్కొక్కటి నాలుగుశేర్లపాలు యిచ్చేగేదలయ్యె, యిదివరకు సుశీలమ్మగారు సుబ్బరంగా పాలుతీసినా యింకా ఆ దూడలకు పాలెక్కువై జబ్బుచేసినై కదండి?

చంద్రం- పోనీ, మా రాఘవయ్య బాబాయిని తీసుకెళ్ళమని చెప్పిరా?

కోటి- ఆ రెండు గొడ్లపాడి ఆ రాఘవయ్యగోరు తీసుకెళ్తే ఏమొత్తందండీ? మీ కిట్టమైతే... సుశీలమ్మగారికిచెప్పి వస్తాను.

చంద్రం- నీకు కాదురా చెప్పేది! నువ్వెళ్ళి చెప్పినపని చెయ్యరాదూ?

కోటి- సరే! అట్టాగేలెండిదొరా! (వెళ్ళిపోతూ మళ్ళీ తిరిగి వచ్చాడు)

చంద్రం- దేనికిగా మళ్ళీవచ్చావు?

కోటి- (నసుకుతూ) పెద్దదొరగారికి ఎట్లావుందండి వంట్లో !

చంద్రం- ఈ రెండురోజులనుండే ఆయనపరిస్థితి ఆందోళనగానే వుంది. యివ్వాళకాస్త కులాసాగావున్నాడు.

కోటి- (విచారంగా) పోనియ్యండిదొరా ! ఆమారాజు ఈ గండం తప్పి బతికిబయటపడితే అదే పదివేలు. పదేళ్ళ నుండే ఈదొడ్లో నౌకరీచేస్తున్నాను. నన్నెన్నడన్నా ఒక్కమాట అనియెరుగా ? ఏందో పెద్దమ్మగారు మునిం చుకొచ్చి అంతఘోరం జరిగిపోయింది. (అమాయకంగా) యింకా సుశీలమ్మగోరు యిక్కడకురాదా దొరా !

చంద్రం- యింకా అదెందుకొస్తుందిరా ! దానికి యిక్కడేం యిల్లా వాకిలా ? పడిపంచల బ్రతుకై పోయింది.

కోటి- నలుగురుండాక మాటా మాటారాకుండా వుంటుందా దొరా ? సుశీలమ్మగారుపోయినాక ఈయింకికళే పోయిందండి !

చంద్రం- నాన్నసంపాదించిన గౌరవమర్యాదలు పోయినై. బంగారంలాంటి ఎద్దుపోయింది. నిన్నటివరకూ కళకళలాడుతూవుండే యిల్లంతాసూన్యమైపోయింది. ఇప్పుడు "దినదిన గండం, దయ్యాలపోరు" లాగుంది.

రాఘు- (వస్తూ) ఓరి, వీళ్ళతల్లిశిగ్గొయ్యా ! వాళ్ళకు మరీ పట్ట

పగ్గాల్లేకుండా వున్నాయిరా? ఈకొంపకీగతిపట్టిందంటే, నేను ఏమిటోననుకున్నాను. కాని, ఈగోడచాటు గుస గుసలుచూస్తే యిప్పుడర్థమౌతుందిరా?

చంద్రం- ఏమిటిబాబాయి? ఏమిటి? (కోటిగాడు వెళ్ళాడు.)

రాఘ- ఓరి, నీమేళాం పాడుగాను, నువ్వుపట్టి పిచ్చాడివిరా? వాటితల్లిశిగ్గొయ్యా! ఆ ఎడ్లపందాలవల్ల వచ్చిచచ్చిందే ముంది? పండంటికాపురం పాడుచేశావు!

చంద్రం- (ఆశ్చర్యంగా) బాబాయి.

రాఘ- ఆ యదవనాయాళ్ళు మనముదనష్టపోడిని బుట్టలో వేసు కుని యిట్లాపగసాధిస్తారని నేనెప్పుడు అనుకోలేదురా?

చంద్రం- అసలు ఏం జరిగిందో చెప్పు బాబాయి.

రాఘ- ఆ.. ఏంజెప్పిచచ్చేదరా! అది తలుపుకొస్తే ప్రాణం తరుక్కుపోతుంటేను, ఆ ముదనష్టపు ఎడ్లపందాల దగ్గర జరిగిన పోట్లాట యింతకాడికి తెస్తూందనుకోలేదు! వీడు దేనికి తెచ్చినట్లు పదివేలరూపాయలు? వాళ్ళు పగ సాధించటానికి మంచి అవకాశం సంపాదించార్రా?

చంద్రం- శ్యామలను కనుక్కుంటే యింక ఏమన్నవిషయాలు తెలుస్తాయేమో?

రాఘ- ఎట్లాకనుక్కుంటారా? ఈరాత్రికి దీనిపెళ్ళయ్యో, మీ యింటికి వస్తుందని దాన్నిచచ్చేటట్లు బాదాడట దాని

బాబు ముండాకొడుకు. ఈ పెళ్ళిసందట్లో ఎట్లాఏలు పడుతుందిరా ?

చంద్రం- (బరువుగా నిట్టూర్చి) యివ్వాళరాత్రికిపెళ్ళి. అవును. ఆ మాటేమరచిపోయాను.

రాఘు- (వినపడక) ఏమిట్రా అంటావు ?

చంద్రం- ఆ...ఆ...ఏమీలేదు బాబాయి. నాన్న కెలావుంది?

రాఘు- యివ్వాళమధ్యాహ్నంనుండి కాస్తజ్వరం తగిలిందట! వెళ్ళిచూచిరాకపోయావా !

చంద్రం- వెళ్ళొస్తాలేబాబాయి, యిదిగో బాబాయి. మాపాడి గేదెల్ని పాలుతియ్యలేదు నువ్వుతీసుకెళ్లు

రాఘు- నాకెందుకురా ? మా పాడి గొడ్లపాలే త్రాగేవాళ్లు లేకపోయారు.

చంద్రం- అవి ప్రొద్దుటినుండీ అరచిచచ్చిపోతున్నయిబాబాయి.

రాఘు- ఓరి, నీమేళాంపాడుగాను. ఆమాటచెపితే నేనుతీసిచ్చి పొద్యేవాడినేగా ?

చంద్రం- పోనీ, యిప్పుడుతీసుకెళ్లు.

రాఘు- ప్రొద్దుగూకవచ్చింది. యికనన్నా దీపం వెలిగించరా ? నేను వెళ్ళిపాలుతీసి యిచ్చివస్తాను. ఓరి, వాళ్ళతల్లి శిగ్గోయ్యా. బంగారంలాంటి సంసారాన్ని ఎలాపాడు

జేశ్వరా ! (రాఘవయ్య వెళ్ళిపోయాడు. చంద్రంఅలాగే దిగులుగా కూర్చున్నాడు. యింతలో బయటనుండి సన్నాయిమేళాలధ్వని వినిపించింది. కంగారుపడ్డాడు. ఆందోళనతో బాధపడుతూ కూర్చున్నాడు. మళ్ళీ లేచాడు. లోపలకువెళ్ళాడు. మళ్ళీవచ్చి కూలబడ్డాడు. యింతలో శ్యామలవచ్చింది. పెళ్ళికూతురుముస్తాబులో వుంది. ముఖం అంతా ఏడుపుతో ఎఱ్ఱబడివుంది. శ్యామలను చూడగానే చంద్రం చివ్వునలేచివెళ్ళాడు. శ్యామల దుఃఖం ఆపుకోలేకపోయింది.)

చంద్రం- శ్యామలా !

శ్యామ- చంద్రం...(యిద్దరూ కలిసిపోయారు. ఓక్షణం గడిచింది. బయట సన్నాయిమేళం మళ్ళీవినిపించింది ఇద్దరూ అదిరిపడ్డారు.)

చంద్రం- నిన్ను ఎవరూచూడలేదా ? శ్యామలా !

శ్యామ- లేదు.

చంద్రం- మీనాన్న లేడా యింట్లో ?

శ్యామ- వున్నాడు !

చంద్రం- నువ్వు వచ్చినట్లు తెలిస్తే

శ్యామ- చంపేస్తాడు ! అంతేగా !

చంద్రం- అంతేనా !

శ్యామ- కాకపోతే యింకా ఏంచేస్తావు? తనపగ సాధించుకో టానికి నాజీవితాన్ని పాడుచేస్తున్నాడు. (ఏడుస్తుంది.) ఈపెళ్ళికన్నా నన్నేంచేసినా నేను చింతించను.

చంద్రం- ఏడుస్తున్నావా శ్యామలా ?

శ్యామ- అంతకంటే ఆడదాన్ని నేను చేయగలిగిందేముంది ? నన్నుయిలా అన్యాయంచేస్తావుంటే నువ్వుచూస్తూ వూరుకుంటావా ?

చంద్రం- నన్నేంచేయమంటావు శ్యామలా ? అవతల మా నాన్న మృత్యుముఖంలోవున్నాడు. ఈయింట్లో "నా" అనేవాళ్ళులేరు. లేకపోతే ... (పళ్ళుకొరుకుతాడు కో పంతో)

శ్యామ- లేకపోతే నేను ఈమనస్సులేని మనువుకువెళ్ళి కుళ్ళి కుళ్ళి యేడవాలిసిందేనా !

చంద్రం- లేదు. నువ్వు ఏడవనక్కరలేదు.

శ్యామ- అంతభాగ్యంకూడానా ! యిప్పుడునన్ను ఏంచేసినా నీదేభారం. నిన్నుయెంతగా ప్రేమించానో ఎవ్వరికేం తెలుస్తుంది ? నా ఆశలన్నీ అడుగంటి పోతున్నాయి. నన్ను ... నన్ను యిలా పరాయిదాన్ని చేస్తుంటే చూస్తూ వూరుకుంటావా ? చంద్రం !

చంద్రం- (ఆవేశంతో బాధపడుతూ) నన్ను కాస్త ఆలోచించు

కోసీయీ శ్యామలా! అవతల మానాన్న మృత్యు ముఖంలోవున్నాడు. ఒకవైపున మా కుటుంబమంతా ముక్కలై పోయివుంది. నన్ను...నన్ను అర్థంచేసుకో శ్యామలా?

శ్యామ- నిన్ను అర్థంచేసుకున్నానుకాబట్టే పెళ్ళిపీటలమీదనుండి గూడా లేచివచ్చాను. మానాన్నచేత ఎన్నోహింసలు పడ్డాను. నువ్వూ నన్నుకాదంటే ఈ గుక్కెడుప్రాణం పోవటానికి చాలామార్గాలున్నయిలే చంద్రం.

చంద్రం- (ఆవేశంతో) శ్యామలా!

శ్యామ- నిన్నటివరకు తియ్యటి కలలుకన్నాం, ఈజీవితానికి నువ్వేనెలుగనుకున్నాను (ఏడ్చింది)

రాఘు- (బయటనుండి పెద్దగా) చంద్రం! ఒరేయ్ చంద్రం. ఒకసారి యిట్లారా! రా!

చంద్రం- ఆ ..వస్తూన్నా బాబాయి. శ్యామల ఒక్కక్షణం ఆగుతావా?

శ్యామ- మనయిద్దరి స్నేహాలూ తెగిపోవటానికివుందిగూడా ఒక్కక్షణమే? (వినిపించుకోడు. బయటకువెళ్ళాడు. శ్యామల కొయ్యబారిపోయింది. కన్నీళ్లు జలజలరాలి క్రిందబడ్డయి. యింతలో కామయ్యవచ్చాడు నవ్వు తూను. కామయ్యనుజూచి శ్యామలహడలిపోయింది.)

కామ- అదేమటమ్మాయి. నాన్న నీకోసం వెతుకుతున్నాడు. యింటినిండ పెళ్ళివాళ్ళేమిటీ? నువ్వయిక్కడికి రావట మేమిటీ? నేననగూడదుగాని. నువ్వు యిలాచేస్తే నాన్నగౌరవం యింకేమన్నా వుంటుందా? చెప్పు?

శ్యామ- (కొయ్యబారిపోయింది. పలుకదు)

కామ- ఇంకా అలాగే నిలబడ్డావేం తల్లీ? నలుగురికీ తెలిస్తే ఎంతఅప్రతిష్ట. రామ్మా; రాపోదాం! (దగ్గరకొస్తాడు. శ్యామల లోపలకు పారిపోవాలని చూస్తుంది. కాని కామయ్య అడ్డునిలబడతాడు. చెయ్యిపట్టుకుని తీసుకు వెళ్ళబోతాడు శ్యామల ఏడుస్తుంది.)

శ్యామ- నన్నువదలిపెట్టు. నేనురాను.

కామ- అయ్యో! అరవకమ్మా! నలుగురికీ తెలిస్తే యింకా తలెత్తుకోగలమా?

జగ- (బయటనుండీ పెద్దగా అరుస్తూ) ఒరేయ్ కామయ్యా! బయటకు లాక్కురారా! దీనిజన్మ తగలెయ్యా! యింకా అక్కడజచ్చింది దేనికిరా?

శ్యామ- నేను...(ఏడుస్తుంది)

కామ- నాన్నకు నేనుమాత్రం నిన్ను అప్పగిస్తానా? నేననగూడదుగాని. నాకూతురొకటీ, నువ్వొకటీనా? రా! పరవా లేదులే! రామ్మా! (యింతలో రాఘవయ్యవచ్చాడు.

రాఘువయ్యనుచూచి బలవంతంగా లాక్కెళ్ళబోతాను) అలానిలబడితే ఎలాగమ్మా! అవతలపెళ్ళిముహూర్తం గూడ సమీపిస్తుంది. పద.

రాఘు- ఓరినీతల్లీ శిగతరగ! యిక్కడికికూడా దాపురించావట్రా !

కామ- రాఘువయ్యా కాస్తజాగ్రత్తగా రానీయి మాటలు.

రాఘు- ఎందుకురాముండా! నీకుయిల్లే చంకలక్రిందమట్టినలిపి లోకులకాపురాలు పాడుచేసేరకం కావురానాది! ఛీ. నీజన్మశిగతరయ్యా! (పైనపడ్తాడు. కామయ్య ఒక్కసారి కోపంగాచూచి శ్యామలను బలవంతాన లాక్కెళ్లాడు. యింతలో చంద్రంవచ్చి చూచాడు. మూలనున్న కర్రకోసం పరుగెత్తుతాడు. రాఘువయ్య పట్టుకొని ఆపుతూ)

రాఘు- చంద్రం. చంద్రం. ఏమిటిరా! ఏమిటిరా! ఈ పిచ్చి ఆవేశం? (యింతలో బయటనుండి శ్యామల "అమ్మో నాన్నా.. నన్నుచంపకు. నన్నుచంపకు...పదవేదిక్కుమాలినముండా. పద." అన్నమాటలు వినిపిస్తాయి.)

చంద్రం- బాబాయి. నన్నువదలు. యివ్వాళతో వీళ్ళనోరికడతాను యింతజరిగినాక యింకా బ్రతికెందుకు బాబాయి.

రాఘు- ఓరి. పిచ్చిముఖమా ? తొందరపడితే పనులవుతయ్యా! అవతల నాన్నకు జ్వరంలో సంధిగుణాలుకూడా ప్రవేశించినైయట. త్వరగా అక్కడకుపద.

చంద్రం-(చంద్రం కర్రక్రిందపడవేశాడు. మంచంమీద కూలబడ్డాడు) ఎంతపనిజరిగింది బాబాయి.

రాఘు- ఓరి వీళ్ళతల్లిశిగ్గొయ్యా! మీబ్రతుకుల్ని కాస్త పాడు చేస్తున్నారుగదరా ? (యింతలో బయట సన్నాయి మేళం వినిపిస్తుంది. చంద్రం ఆవేశం మరీ పొంగుతుంది.)

చంద్రం- బ్రతికిసాధించాలి. ఏంసాధిస్తాను. నా ఆఖరిప్రయత్నం గూడా విఫలమైపోయింది. నాబ్రతుకే భగ్నమైపోయింది.

రాఘు- ఏమీకాలేదురా. నాన్నదగ్గర కెళ్ళొద్దాంరా ? అక్కడ సుశీల వక్కతే ఏడుస్తూకూర్చునివుంది. వెళదాంపదరా? (యింతలో నరసయ్యనౌకరు కోటిగాడువచ్చాడు ఏడుస్తూను.)

కోటి- చంద్రయ్యగోరూ!

రాఘు- యేమిటిరా ?

కోటి- చిన్నదొరగారు కొట్టాడండి.

చంద్రం- దేనికి ?

కోటి- వామిలో గడ్డిదుయ్యటానికి వెళితేను. దుయ్యటానికి వీల్లేదని కొట్టాడండి.

చంద్రం- అట్లాగా ! (ఆవేశంతో లేచాడు)

కోటి- యికనుండి వామిచాయలకొస్తే పూడ్చిపెడతానన్నాడండి.

చంద్రం- విన్నావురా బాబాయి ! ఎంతవరకని తలవంచుకొని పొయ్యేది ? వరేయ్, నువ్వువెళ్ళిగడ్డిదుయ్యి. ఎవడడ్డమొస్తాడో చూస్తాను.

రాఘు- ఒరేయ్ చంద్రం, నువ్వు తొందరపడతావేంరా ? అవతల నాన్నకు ప్రాణంమీదకొచ్చింది. ముందు అక్కడకు పదరా ?

(యింతలో రంగారావే వచ్చాడు. కోటిగాడు పారిపోయాడు )

రంగా- యిదిగో ! రాఘువయ్యబాబాయి. ఈ పొలికేకలకుబెదిరి పొయ్యే వాళ్ళెవరూ లేరిక్కడ ! యివ్వాళనుండీ ఆ వామిలో గడ్డిదుయ్యటానికి వీల్లేదు !

చంద్రం- ఎట్లావీల్లేదో చూస్తాగా ?

రాఘు- నామాట ఎవరన్నా వింటార్రా ! మీరు యిద్దరూ తగువుపెట్టుకొని ఆనోరులేని పశువుల్ని చంపుతారట్రా?

రంగా- బాబాయి. నువ్వు మావిషయాల్లో కలుగజేసుకోకు. యిదిగో! ఈ యింటికిగూడా తాళం వేస్తున్నాను. భాగాలపంపిణీ అయినతరువాతే ఈకొంపలో ఎవరు న్నాను. అంతవరదాకా ఎవరిదారివాళ్ళు చూచుకోవ టం మంచిది!

చంద్రం- ఆమాత్రంగుండెలుంటే వచ్చి యింటికి తాళంవెయ్య మను తెలుస్తుంది?

రంగా- (ఉద్రేకంగా) ఎవరికి గుండెలున్నదీ యిప్పుడే తేలుస్తా ను రమ్మను ఎవడడ్డమొస్తాడో? (వెళ్ళి యింటికి తాళం వేస్తాడు. చంద్రం మూలనున్న పలుగుదీసి తాళం బద్దలుకొట్టబోతాడు. రాఘవయ్య అడ్డమొస్తాడు.)

రాఘు- నామాట వినండిరా రంగారావు! అంతా పంచుకోవా లంటే కాస్తగుట్టుగా పంచుకోండిరా? యిలా నలుగురూ నవ్వాలటరా! ఛీఛీ.

చంద్రం- మానమర్యాదలు మట్టిలో కలిసినాక బ్రతికేందుకు?

రంగా- పెద్ద మర్యాదకలవాడివి దొరికావులేవోయి. యిదిగో బాబాయి. మళ్ళీ తాళంతీస్తే మాటదక్కదు.

చంద్రం- బాబాయి అడ్డంలే!

రంగా- తాళంమీద చెయ్యివేసి బ్రతుకు తెలుస్తుంది?

రాఘు- రంగారావు!

రంగా- బాబాయి. మళ్ళీ చెవుతున్నాను, మావిషయాల్లో జోక్యం కలుగజేసుకోకు. ముసలాడ్ని మంచిజేసుకొని ఆస్తంతా కాజేయాలనిచూస్తారూ, చూద్దాంగా?

చంద్రం- ఏమిట్రా? నువ్వుచూచేది! (పైకెళ్ళబోతాడు)

రంగా- రానీయి. ప్రాణంమీద తీపివుంటే, (యింతలో బయట నుండి సన్నాయిమేళం తీవ్రస్థాయిలో వినుపిస్తుంటుంది. కోటిగాడు పరుగెత్తుకుంటూవస్తాడు. చంద్రం తాళం బ్రద్దలుకొట్టటానికి రెండుచేతులతో పలుగు పైకెత్తు తాడు.)

కోటి- రాఘవయ్యగోరూ. పెద్దదొరగారు, పెద్దదొరగారు.

చంద్రం- ఏమిటిరా? (పలుగుదించాడు)

కోటి- చచ్చిపోయాడు. (ఏడ్చాడు)

చంద్రం- (చేతుల్లోనుండి పలుగుజారి క్రిందబడింగి దుఃఖంతో) నానా. (బయటకు పరుగెత్తాడు)

రాఘు- యింకాచూస్తావేంరా! పదరా దిక్కుమాలినాడా! (త్వరగా వెళ్ళబోయాడు. రంగారావు నిలబడ్డాడు.)

(తెర)

# "రైతు బిడ్డలు"

## అయిదవరంగం

[ తెర ]

సీను- (అది జగన్నాధరావు మేడ - ముందు వరండాహాలు. అంతా వెనుకటిసీనే - శ్యామలకూర్చుని విచారంగా పాటపాడుతుంది. క్రొత్తచీరె-మెడలో మంగళసూత్రం - రాత్రితలలో తురిమిన మల్లెపూలు వాడిపోయివుంటయి. కన్నీటితో ముఖమంతా కందిపోయివుంటుంది.)

పాట

శ్యామ- తుదిఆశ మొదలంట
తెగిపోయె ఈరాత్రి
కారుమేఘపు తెరలు
జారెనే మననడుమ
బ్రతుకంత నీరాత్రి
దుఃఖభరమై తోచె ॥తు॥

మధుర స్వప్నాలన్ని
మటుమాయమైపోయె
మోయరాని హృదయబాధ
మరువలేని వలపుగాధ
మిగిలిపోయెనా ? జీవితమే
పగిలి కూలెనా ? ॥తు॥

(పాటఅయిపోయేసరికి తెరలో జగన్నాధరావూ, కామయ్యా పెద్ద పెద్దగానవ్వుతూ వస్తుంటారు. శ్యామల కన్నీళ్ళు తుడుచుకొంటూ లోపలకు వెళ్ళిపోతుంది. యిద్దరూ వస్తారు )

జగ- ఆ...(కూర్చుంటూ) తరువాత యేంజరిగిందిరా ?

కామ- యింకాజరిగేదేమిటీ (నవ్వుతూ కూర్చొని) నేననగూడదుగాని. మళ్ళీవాళ్ళకు పునర్జన్మంటూ ఒకటి వుంటుందా? అః (నవ్వి) ఏమో, నాకునమ్మకంలేదు.

జగ- కొండదగ్గర ఆచంద్రంగాడికి పట్టపగ్గాలున్నయ్యాటయ్యా! వాడు ఎంతపందాల్లోగెలి స్తేమాత్రం పెద్దా చిన్నా. తారతమ్యం వుండనక్కర్లా ?

కాము- అందుకేగా అనుభవిస్తున్నాడు. నేననగూడదుగాని. "చేసుకున్నవాడికి చేసుకున్నంతమహాదేవా" అన్నారు పెద్దలు.

జగ- అదిసరేగాని, ఆ రాఘవయ్యగాడికీ, వీళ్ళకూ ఏమిట్రా సంబంధం ?

కామ- ఆ...సంబంధం ఏముందీ! ఏదో యింటిప్రక్కయిల్లు. నేననగూడదుగాని. ఆనరసయ్యంటే వాడికిచచ్చేంత అభిమానం. అంతకంటే ఏముంటుంది ?

జగ- ఈ రాఘవయ్యగా డెక్కడ దాపురించాడయ్యా! మనకు శనిగ్రహమల్లేను.

కామ- నేననగూడదుగాని. వీట్లో ఎవురీదేవాడికి గడ్డిపరక లాధారం సరిపోతుందా ?

జగ- బాగాజెప్పావు. (నవ్వి) అదినరేగాని ఈ సంవత్సరం భూమిసాగు పాడుబెట్టినట్లేనా ?

కామ- గొడ్డూగోదా, చెట్టుకొకటి పుట్టకొకటి అయిపోయినయ్యా ! ఆ నరసయ్య చావుతో భాగాలపంపిణీకోసం యింటికి తాళాలువేశారా ! నేనసగూడదుగాని. నరసయ్య సంపాదించిన పరువుమర్యాదలు గంగలో కలిసినై. యివ్వాళ ఊళ్ళోగుక్కెడు మంచినీళ్ళు పుడతయ్యండీ వీళ్ళకు ?

జగ- యిప్పుడు ఈ చంద్రంగాడు చెల్లెలుదగ్గరకు చేరాడటగా ?

కామ- అంతకంటే వాడికి దరేముందీ ? నేనసగూడదుగాని రంగారావు యింతలేసి అఘాయిత్యాలు చేస్తాడని నేను కలలోగూడా అనుకోలేదు.

జగ- వాడికి నువ్వుబోధించినబోధ అలాంటిది. మరి...

కామ- (నవ్వుతాడు) ఏదీ. ఆపాతపెండెలోది ఒకనాలుగు పుగాకుతుంపు లిలాపడవెయ్యి.

జగ- అదినరేగాని. రేపు ఈ గ్రామపంచాయితీ ఎలక్షనులో ఈ సత్యంగాడు మనకు అడ్డమొచ్చేలాగున్నాడురా ?

కామ- వాడిమొహం. వాణ్ణిచూసి భయపడతారేమిటి ?

జగ- ఈ ఊళ్ళోవున్న కుర్రవెధవలంతా వాడివెంట పడుతున్నారయ్యో.

కామ- నేననగూడదుగాని కుర్రవాడికేంతెలుసురా వుండేలు దెబ్బని నోరువాయిలేని ఈకుంకలేంజేసి ఏడుస్తారంటావు?

జగ- అలా అనగూడదురా! వాడేదో ఈమధ్య గ్రామపునరుద్ధరణ కార్యక్రమం బుజానవేసుకొని స్కూళ్ళని, లైబ్రరీలనీ, హాస్పటలులనీ, వాడిశ్రార్ధం అని ఈ పిచ్చిజనానికి మందువేశాడుకదరా ?

కాము- అదే నేనూ ఆలోచిస్తున్నాను. నేననగూడదుగాని. రంగారావుగాడిద్వారానే మనం వాడికి పుటంపెట్టాలి.

జగ- (ఆలోచనాపూర్వకంగా) అదే ఎట్లాగని?

కామ- అసలు వాడినిరానీ యిక్కడికి. నేననగూడదుగాని. ఊళ్ళో అనేకకులాల వాళ్ళున్నారు.

జగ- (వుగాకిస్తాడు) వుంటే?

కామ- కులపెద్దల్ని పట్టుకున్నామంటే ఈ కుర్రకుంకలేంచేస్తారు? నేననకూడదుగాని. పెద్దవాళ్ళే మనపక్షానచేరితే వీళ్ళకు యింటిదగ్గర తిండికూడా పుట్టకుండా చేయగలం.

జగ- (నవ్వి) నువ్వు అంతటివాడివి కాదనికాదు. కాని, ఆ పెద్దవాళ్ళు మనపక్షానికిరావటం ఎట్లాగా అని?

కామ- (నవ్వి) ఆ...దానికిగూడా ఓపెద్ద ఆలోచనదేనికి? "డబ్బుకు దాసుడు కానివాడిని ఈ భూప్రపంచంలో చూచావా? అని. నేననగూడదుగాని. అదంతా మన చేతిలోవుంది.

జగ- డబ్బుపోతేపోయింది. ఓడిపోతే పరువుపోతుందికదా? అని.

కామ- అది నేనుమాత్రం ఆలోచించటంలేదంటూరా? ఈ ఊళ్లో మా కమ్మజనాభా యెంతవుందో. అంతమంది నాయుళ్ళున్నారు. నేననగూడదుగాని. వాళ్ళ నాయకుడిని చీల్చామా? యింకా ఆసత్యంగాడికి ఒక్కవోటు వస్తుందండి?

జగ- అంత తేలిగ్గా వాళ్ళుమాత్రం మనతరుపుకు రావద్దూ ?

కామ- ఎందుకురార్రా? ఒక్కవెయ్యిరూపాయలు వాళ్ళ మొఖాన పారవేయండి. తరువాత నేనాడిస్తాను వాళ్ళని. ఒకాట. నేననగూడదుగాని. ఆ నాయుడు నాంచారయ్య మాటంటే అంతావింటారు!

జగ- ఆ నాంచారయ్య కొడుకుగూడా సత్యంతోకలిసి ఎలక్షనులో నిలుస్తాడటగా?

కామ- (నవ్వి) నేననగూడదుగాని. మనం నాంచారయ్యనే నిలబెడదాం?

జగ- అతను ఒప్పుకోవద్దూ ?

కాము- నేను ఒప్పిస్తాగా ? మీకెందుకా భయం. (భీముడొచ్చాడు )

జగ- ఏరా ! మాలపల్లెలో ఎలావుందిరా మెలక్షను ప్రచారం?

భీము- మాజోరుగావుందండి ! ఏందో ! ఎదవనాయాళ్లు ! ఆసత్యంగోరువత్తే గొర్రెలగుంపల్లే వెంటపడుతున్నారండీ!

కాము- మరి, మీసంఘుపెద్దలంతా ఏమైనట్లురా ? నేననగూడదుగాని. ఈకుప్రకారుకు పెత్తనంయిస్తే యింకా ఒక్కరోజు మనం వూళ్లో బ్రతకటానికేనా ?

భీము- అందుకే నేనూ యింటింటికీతిరిగి చెప్పానండి. ఒక్క యదవనాయాలూ నామాటపట్టించుకుంటేనా ?

జగ- అయితే మీపల్లెలోఓట్లు మాకేం రావంటావట్రా ?

కాము- ఆ...ఎందుకురావు. నేననగూడదుగాని. వాళ్ళుమాత్రం మనుషులుగాదండి. ఏదో నాలుగురూపాయలు వస్తే ఉప్పుకూ, పప్పుకూ వస్తయ్యనే వాళ్ళేడుపు.

భీము- మాబాగాజెప్పారు. ఎక్కడికి పోతారండి, మనల్నికాదని.

జగ- ఒక్కసారి మీకులపెద్ద నాగాయిని యిక్కడికి రమ్మనిచెప్పరా ?

కామ- ఒక్కనాగాయేనా? (నవ్వి) నేననగూడదనుగాని. ఈ భీముడుగూడా ఒకప్పుడు కులపెద్దల్లోవాడే?

భీము- ఆరోజులన్నీ పోయినైయండి. మా కుర్రనాయాళ్ళంతా ఎక్కొచ్చినాక మాపెద్దరికాలేమన్నా సాగనిత్తన్నారా? చత్తున్నారా?

కామ- వాళ్ళు సాగనిచ్చేదేమిటిరా? నేననగూడదుగాని. అట్లా, సాగించుకొనేశక్తి మీలోచావలేదని చెప్పరాదూ! ఒరేయ్. నేనొక్కటి చెపుతానువిను. తెల్లవారిలేస్తే షావుకారుగారి చేలోకిరాకతప్పదు. మీ మాలపల్లి చుట్టూ దొరగారిచేలేనయ్యె. వాళ్లుసక్రమంగావినకపోతే వాళ్ళకుతగినశాస్తి జరిగితీరుతుంది. (నేననగూడదుగాని. ఏదో పేదముండాకొడుకులు మంచినీళ్ళకుకూడా ముఖం వాచి చస్తున్నారని. మీపల్లెమధ్య బంగారంలాంటి మంచినీళ్ళభావిగూడా తవ్వించాడుకదరా! ఆపాటి కృతజ్ఞతన్నాలేదేంరా? మీకు?)

భీము- అదేందండి. నన్నంటారు? మీరుచెప్పింది ఎప్పుడుచెయ్యలేదంటారు?

జగ- కామయ్యచెప్పిందాట్లోమాత్రం తప్పేముందిరా? మీ కులపెద్దలంతా కుర్రాళ్ళకు నచ్చచెప్పండి. అవసరమైతే డబ్బుపారేద్దాం మొఖాన.

భీము- అట్లాగేనండిదొరా!

కామ– అంతేగాదురా! పల్లెలో కాస్త నోరుకలిగినవాళ్ళని కాస్త త్రాగుడు అలవాటున్నవాళ్ళనుగూడా చేరదియ్యాలిరా! నేననగూడదుగాని. మీకు పొట్టపొడిచినా తెలివి కనుపించదేంరా? యింకా కులపెద్దనంటావు?

భీము– కామయ్యగోరూ! మీ శాస్త్రాలకేంలెండి. అసత్యంగా రొచ్చి మా యెదవనాయాళ్ళకు పురెక్కించిందాకా పురుగులల్లేనే పడుండారు మా కాళ్ళదగ్గర?

జగ– వస్తాదురా! వస్తాడు! (పళ్ళుకొరికి) మనతో విరోధం పెట్టుకుని చంద్రంగాడు ఏమయ్యాడో! యిప్పుడు వీడి పని అంతేఅవుతుంది. వీళ్ళు మనకెక్కడ దాపురించారయ్యా! ప్రతివక్కడూ కత్తిపట్టుకుకూర్చుంటున్నాడు!

కామ–"గొఱ్ఱెకొవ్విందల్లా గొల్లవాడికేమంచిదని" వాళ్ళెంతవరకొస్తారో రానివ్వండి. నేననగూడదుగాని ఈ ఊళ్ళో నరసయ్యకుటుంబమో లేక సాహుకారు కుటుంబమో ఒక్కటేవుండాలి.

భీము– మాబాగా చెప్పారండి. అంతే నన్నుమట్టుకు నన్ను ఎన్నిమాటలన్నారండి. యియ్యాల అనమను తెలుస్తుంది. ఆ చంద్రంగాణ్ణి.

జగ– వాళ్ళకేం సిగ్గా ఎగ్గా. ఎప్పుడైనా అంటారు.

కామ– ఒరేయ్ అసత్యంగాణ్ణి అణచివేసే మార్గం ఏమీలేదట్రా?

భీము- ఆయన్ని ఏంచేస్తాందొరా! మనిషి మానిప్పు లాంటి వాడయ్యా

జగ- ఆమార్గం కామయ్యా ఆలోచించాలి.

భీము- నేను మొట్టమొదటే చెప్పాను గదండి. ఆయన బతికుండాడి గుడ్లుతో డేరకం కాదండీ యీాయన.

కామ- అఘోరించావులేరా! ఎధవ. ఆవేళ ఎడ్లకు మందుపెట్టి రమ్మంటే గరుడ పక్షిలాగ తిరిగి వస్తివిగా! నేననగూడదుగాని. యిక మీావల్ల అయ్యే పనులేమున్నయిరా!

భీము- ఆయాల నేను చావిట్లోకెళ్ళేసరికే ఆ నరసయ్యా గారు వచ్చాడు. ఆయన్ని పడనెట్టి పారిపోయి వచ్చాను. ఈల్లేకపోతే ఎట్టాచేత్తారండి?

కామ- నేననగూడదుగాని ఏదీ యివ్వాళ చూపించు. నీకు రోషం ఏమన్నా వుంటే?

భీము- ఏంచేయమంటా రేంది?

జగ- కామయ్యా చెప్పినట్లు కానియ్యవోయి. నీవల్ల అర్థణా ఆదాలేదు మాకు.

కామ- ఆసత్యాన్ని కాస్తా వీధి మొఖం చూడకుండా చెయ్యాలి?

భీము- అదే ఎట్టాగండి?

కామ- ఎట్లాగేమిటిరా? మీాపల్లెలో దేనితోనో సంబంధం

వుందని నేరంఆరోపించను. ఒకరాత్రి. (ఆగి) ఆరెండు రెక్కలు విరిచివేసెయ్యి నేననగూడదుగాని ఈ మాత్రం తెలియకపోతే నువ్వియింకా కులపెద్దవెట్లా గయ్యావురా ?

జగ- (నవ్వి) కామయ్య లాంటివాడు నీకు సలహాదారుడైతే యింకా ఆలోచిస్తావేంరా !

భీము- సరే ! కానియ్యండి. మీావుప్పు పులుసూతిన్న ఈభీముడి తడాకా ? (యింతలో రంగారావు వచ్చాడు. అంతా నిశ్శబ్దంగా వున్నారు కామయ్య నవ్వుతూ)

కామ- రా ! రా ! రంగారావు! రా ! నేననగూడదుగాని నాలుగు రోజులనుండి మరీ కంటికి కనుపించటమే మానేశావేంరా?

రంగా- ఏదీ తీరికదొరకటంలేదు బాబాయి రావాలంటేను.

భీము- యింకా ఆయనేం కొత్తాడండి. ఆస్తి పంచుకోమంటే అయ్యనే చంపాడు

రంగా- నోర్మూయ్ (కోపంతో అరిచాడు)

కామ- (కామయ్యనవ్వుతూ) వాడు అయ్యనుచంపితే, నువ్వు చేసివచ్చిన ఘనకార్యం మాత్రం ఏముంది ? మీా అమ్మనుకాస్తాచంపి దానిపేరునున్న అరెకరం మాగాని అమ్మి కల్లుదుకాణానికి ధారపోస్తివిగా ?

భీము- నేనుచంపానేంది. అదేచచ్చింది చూచేదిక్కులేక.

జగ- ఎట్లాచస్తేనేం. మొత్తంమీద చచ్చిందిగా! (నవ్వు) నువ్వూర్కోరా! కామయ్యకు కోపంవచ్చింది?

కామ- దేనికండి. వీడికి యిన్నేళ్ళువచ్చినై. నేననగూడదుగాని. అనేమాట, అననిమాట తెలియక్కర్లా? వాడు మాత్రం కావాలనిచేశాడా? పేరుమాత్రంవాడికొచ్చింది గాని, ఎవడిచావుకు ఎవడుకారణంరా? అంతాకర్మ?

భీము- ఏదోబుద్ధితక్కువై అన్నా లెండి.

రంగా- బాబాయి. నీతోమాట్లాడాలి. ఒకసారి యింటి కొస్తావా?

కామ- వస్తాలే! కాస్తాగువెళదాం? అదికాదురా! నేననగూడదుగాని. నలుగుర్లో అంత అల్లంపాలయ్యావేంరా! దేనికిరా బాగాబ్రతికిన మమ్మల్ని యిట్లా బజారుపాలు చేయటం? అంతపంచుకోవాలనేవుంటే మూడవకంటి వాడికి తెలియకుండా చేసుకోకూడదట్రా? అది నీకు మాత్రం పరువా? మీ నాన్నకుమాత్రం పరువా? ఓరిపెద్దమ్మాన్రా! ఎంతపనిచేశావురా?

రంగా- దేనికిబాబాయి ఈసోదంతాను. అట్లాంటి వెధవలతో నాకుమంచేముంది? చెడేముంది?

జగ- నువ్వు రంగారావును వెనకోసుకొస్తున్నావుగాని, అతను

మాత్రం చేసినతప్పేముంది? తనఆస్తిని అపహరిస్తుంటే చూస్తూ ఎవ్వరైతేమట్టుకు ఎట్లావూరుకుంటారు?

భీము- సత్తం చెప్పారండి.

కామ- నువ్వు నోర్ముయ్యవోయ్. పెద్ద సత్యవేత్తవు బయలు దేరావు. యివ్వాళవీధిలోకొస్తే నలుగురూ అనేమాటలు వింటుంటే కడుపుతరుక్కుపోయింది. (నేననకూడదుగాని. నీకేం ఊడగొట్టిన నాగటిమేకల్లే పరువా! మర్యాదా?)

రంగా- అదంతా యిప్పుడెందుకులే పోనియి బాబాయి. నీతో మాట్లాడాలి వస్తావా?

జగ- వెళ్ళవయ్యా! రంగారావు అలా నిలబడేవున్నావేం కూర్చో!

రంగా- పరవాలేదులెండి. నేనువెళ్ళాలి. త్వరగాను.

కామ- ((నవ్వుతూ జగన్నాథరావుకు సైగచేస్తాడు) అలాగే నిలబడ్డావేంరా? వెళదాంలే కూర్చో? నేననకూడదుగాని. యింత అమాయకుడివైతే ఎట్లాబ్రతుకుతావురా పెద్దమ్మా?

రంగా- (మాట్లాడడు)

భీము- మీరుండగా ఆనోరకు భయమేమిటండి! (నవ్వాడు)

జగ- (ఆగమని సైగచేసి) ఏమయ్యా రంగారావు. కాస్త లెక్కచూచి ఆనోటుతాలూకూపైకం పంపుతావా? నాకుచాలా అవుసరంగాకావాలిసొచ్చింది! యిప్పుడు.

రంగా- యింకా పదిరోజులాగండి. ఈభాగాలపంపిణీ తెగితే మీా బాకీఅంతా సుప్తాగాయిచ్చేస్తాను.

జగ- అంతా యివ్వనక్కరలేదులే. అందులో సగం యివ్వు. ఈయిబ్బంది గడుస్తుంది?

రంగా- ఇప్పుడు నాదగ్గర ఐదువందలుమట్టుకు ఎక్కడవున్నయి.

జగ- అయిదువందలేమిటయ్యా రంగారావు?

రంగా- నోటువ్రాసింది వెయ్యిరూపాయలకేఅయినా, ఇప్పుడు ప్రస్తుతం అయిదువందలు చెల్లవేద్దాం మనుకుంటున్నాను!

జగ- అదేమిటయ్యా! నోటు వెయ్యిరూపాయలకేమిటి? పదివేలకైతేను. మరచిపోయినట్లున్నావే?

రంగా- (అదరిపడి) పదివేలకా? అంతడబ్బు ఎప్పుడిచ్చారునాకు

జగ- నేను అబద్దం వ్రాయించుకున్నానంటావా? ఈభీముడు చేతనేగా నీకు తొమ్మిదివేలూ కావాలంటే పంపింది?

భీము- ఔనండిదొరా? ఆయాల నాచేతులతోనే తీసుకెళ్ళి యిచ్చాను.

కామ- (మెదలకుండా చుట్టకాలుస్తుంటాడు.)

రంగా- నోర్మూయ్. వెధవ! అబద్దం ఆడావా! డొక్క పగల దీస్తాను.

భీము- (కోపంగా!) అబద్దం ఆడాలిసిన పనినాకేం వుందండి. తీసుకోని లేదని మీరే అబద్దం ఆడుతున్నారు!

జగ- కావాలంటే నోటు చూచుకో ఎంతకు వ్రాశావో తెలుస్తుంది.

రంగా- (కోపంతో) చూచుకుంటే ఏముంటుంది. వ్రాసుకుంటే వుంటుందిగాని. ఇలా ఎంతమంది కాపురాలుతీస్తావు అన్యాయంగా నోటులు వ్రాయించుకొని.

కామ- ఊరుకోరా పెద్దన్నా! నేనులేకుండా నువ్వు నోటు వ్రాయటం దేనికి? యిప్పుడు ఏడవటం దేనికి? అన్నీ తెలివితక్కువపనులు చేసుకుని అఘోరించి యివ్వాళ ఏడిస్తే లాభమేముంది? (నేననగూడదుగాని. షాహుకారుమాత్రం అబద్ధం ఆడతాడా? చెప్పు)

రంగా- (కోపంగా) అయితే నేను తీసుకెళ్ళలేదంటున్నానా?

కామ- నన్నడుగుతావేంరా? నేననగూడదుగాని. నేనున్నానా? నోటు వ్రాసినప్పుడు?

గంగా- నాకు చదువురాదని మీయిష్టం వచ్చినట్లు నోట్లు

ప్రాయించుకుంటారూ? ఛీ. ఈఅబద్దాల గడ్డి తినక పోతేనేం?

జగ- (పెద్దగా) నోర్మూయ్. వళ్ళుదగ్గర పెట్టుకుని మాట్లాడు జాగ్రత్తా!

రంగా- అట్లాగా? నీఅంతు తేలుస్తాను బజార్లోకిరా! యిట్లా ఎందరి కొంపలార్పుతావు! (కామయ్యతో) అట్లా నంగి నంగి కూర్చున్నావేం! ఇంతకి రాతకేంచేస్తారా మీకంటే కుక్కలు నయ్యం

జగ- (కోపంగా) భీముడు!

భీము- పదవయ్యా బయటకు. ఊరికేవాగావంటే చచ్చిన కుక్కకు మళ్ళే కాళ్ళకు తాడుగట్టి కట్టమీదకీడుస్తా!

రంగా- గుండెలుంటే అడుగుముందుకు వెయ్యమను తేలుస్తుంది.

జగ- నెట్టివేయండిరా! బయటకు. ముండ! పీడిచ్చేదేమిటి? రేపీపాటికల్లా నెత్తురుబొట్లుతో సహా కక్కిస్తాను.

రంగా- అదే. తొందరపడకు తెలుస్తుంది.

జగ- ఏమిటోయ్ తెలిసేది. నీబాబుతో చెప్పుకోపోయి. అట్లా చూస్తావేంరా! నీకాదు చెప్పేది?

భీము- ఇక్కడనుండిపోతావా? మెడమీద కర్రవేసి నెట్టమంటావా? (భీముడుదగ్గరకు వెళతాడు. రంగారావు

చెయ్యియెత్తి కొట్టబోతాడు. కామయ్యవచ్చి వదిలించ బోతాడు. రంగారావు విదిలించుకుని రివ్వునావెళ్ళపో తాడు కోపంతో. అంతా వెనుకనుండి విరగబడి నవ్వు తుంటారు. యింతలో తెరలో జగన్నాధరావు నౌకరు పెద్దగా అరుస్తూవస్తాడు.)

నౌక- దొరగారూ! దొరగారూ! శ్యామలమ్మగారు బా యిలో దూకింది. తొందరగారాండి. తొందరగారండి దొరా!

కామ- భావిలో దూకిందిరా?

జగ- అమ్మాయ్. (లోపల కెళ్ళిపోయాడు) యెంతపని చేసిందిరా!

కామ- పదరా! యింకా అట్లాచూస్తావేం? నిన్ను కాదురా? దున్నపోతల్లే కదలవేం? నేననగూడదుగాని. మిమ్మల్ని దేనికిపుట్టించాడురా దేముడు. (వెళ్ళిపోయాడు లోప లకు)

భీము- మీకుమల్లే కొంపలార్పమని పుట్టించలా నన్ను. (రో షంతో లోపలకువెళ్ళాడు.)

[ తెర ]

# " రైతు బిడ్డలు "

## ఆరవ రంగము

[ తెర ]

సీను- (అది సత్యంవుంటున్న రాఘవయ్యగారి యిల్లు. సుశీల విచారంగా ఆసాయంత్రంవేళ మంచాలు బయటకు జేరవేస్తూవుంటుంది. ప్రక్కచుట్టలు తెచ్చి మంచంమీాద పడవేసి కొద్దిసేపు విచారంగాకూర్చోని, కన్నీరుకారుస్తూ మెల్లగా పాటపాడుతుంది.)

సుశీ- (పాట)

ఏమౌనో ! మా బ్రతు కేమౌనో !
ఏమి తెలియదాయెగా
వెలుగు కానరాదుగా
ఏమౌనో............॥ఏ॥
ఏనాటికానాడు ఏటిలోపడవలా
చుక్కాని తెరచాప ముక్కలై పోయి
నడిఏటిలో మునుగునో, ఈనావ
నదతీరమే జేరునో ! ॥ఏ॥
ఎందుకో మాపైన అంధకారపునీడ
ముందైనలేదేమొ పండువెన్నెలజాడ
ఎదపైన వ్యధలాయెనే !
మదిలోన దిగులాయెనే ! ॥ఏ॥

(పాట అయిపోయేసరికి చంద్రంవచ్చి వెనుకనిలబడి విచారిస్తూవుంటాడు. గడ్డం పెరిగివుంది. ముఖంచిన్న బోయివుంది. సుశీల కన్నీళ్ళుతుడుచుకుంటూ వెనుదిరిగి చూచి దుఃఖాన్ని ఆపుకోలేక చంద్రంహృదయంమీద వాలిపోయింది.)

సుశీ- అన్నయ్యా! (ఏడుస్తుంది.)

చంద్రం- సుశీ...(కన్నీళ్ళురాలాయి) దేనికి ఏడుస్తావుఊరుకో! అంతా అయిపోయింది. చేతులారా సర్వనాశనం అయిపోయాము. పరులచేతుల్లో కీలుబొమ్మలమైపో యాము. ఈ పడిపంచల్లో తలదాచుకుంటున్నాం. వీధిలోకి వెళితే సిగ్గుతో తలవాలి పోతూవుంది.

సుశీ- అన్నయ్యా! (దూరంగావెళ్ళి నిలబడ్డాడు కన్నీళ్ళు తుడుచుకుంటూను. దుఃఖంతో ముఖంకప్పుకున్నాడు)

చంద్రం- నీ అన్నలు సరైనవాళ్ళయితే నీకు యిలాంటి గతెం దుకొస్తుందే సుశీ...

సుశీ- అదంతా నా దురదృష్టంలే అన్నయ్యా!

చంద్రం- ఎవరి దురదృష్టమైనా అనుభవిస్తుంది మనమేగా? ఆనాడు నేను ఎడ్లపందాలకు వెళ్ళకుండావుంటే ఈనాడీ ఘోరం జరిగేదికాదుగా?

సుశీ- నువ్వుమాత్రం కావాలని చేశావా?

చంద్రం- ఎందుకు చేయలేదు? మనకు తగనివిషయాల్లో తల దూర్చటంమాత్రం తప్పుగాదూ? (సత్యంవచ్చాడు)

సత్యం- "చేతులు కాలినాక ఆకులుపట్టుకుంటే" యేముంది? యిందులో అంతాభాగస్థులమేగా? ఒకరిని ఒకరు అర్థంచేసుకోలేక యిలా నాశనం అయ్యాం. గతజల సేతుబంధనం, జరిగినతప్పుల్ని మరచిపోకుండా, ముందైనా జాగ్రత్తగానడిస్తే యిలాంటి బాధలురావు.

సుశీ- ఎలా మరచిపోతాము. బంగారంలాంటి సంసారం పాడయ్యింది. నాన్ననుపోగొట్టుకున్నాం. పసిడేనుపుట్లు ధాన్యంపండేపొలం సాగులేకుండా పాడుపెట్టుకున్నాం.

(కన్నీళ్ళతో గొంతుపూడిపోయింది.)

సత్యం- ఆ...విన్నావా చంద్రం. రాత్రి శ్యామల భావిలోపడి చచ్చిపోయింది.

చంద్రం- (పలుకడు. కన్నీళ్ళు జారిపడ్డయిక్రింద)

సుశీ- ఎంతపనిచేశారు! దుర్మార్గులు. దానిబ్రతుకుని పాడుచేశారు. అన్నయ్యను చేసుకోవాలని యెంత ఆరాటపడింది.

(చంద్రం నిలవలేక లోపలకు వెళ్ళిపోయాడు.)

సత్యం- సుశీ! నేనువచ్చేసరికి చాలా పొద్దుపోతుందేమో! మీరు నాకోసం ఎదురుచూడకండి.

సుశీ- అసలే చీకటిరోజులు. మీరు పెందలాడే రాకూడదూ! మనపరిస్థితి బాగాలేదయ్యే. (విచారంగా అంటుంది.)

సత్యం- మరేంపరవాలేదు. తొందరగానే వచ్చేస్తాను. చీకటి పడింది వెళ్ళి దీపంవెలిగించు. (వెళ్లాడు. శ్యామల లోపలకు వెళ్ళి లాంతరు వెలిగించుకొచ్చింది. రాఘవయ్య వచ్చాడు.)

రాఘు- ఓరి వాళ్ళ తల్లిశిగ్గోయ్యా! యెంతపని చేశార్రా చివరకు.

సుశీ- ఏమిటి బాబాయి ?

రాఘు- ఆ యేముంది. మనరంగడ్నే మెడబట్టి బయటకుగెంటా రంట.

సుశీ- దేనికి ?

రాఘు- అదే! ఆడబ్బుదగ్గర పేచీయే. వెయ్యిరూపాయలిచ్చి పదివేలకు నోటు వ్రాయించుకున్నారని చెప్పానుగా! యివ్వాళ వీడు కర్రపట్టుకొని ప్రొద్దుటినుండీ ఊరిమీద తిరుగుతున్నాడు దేనికోమరి ?

సుశీ- ఏదన్నా అఘాయిత్యం చేస్తాడేమో బాబాయి. ఊళ్లో పోలీసులుగూడా వున్నారు!

రాఘు- నేను పిలిచినా వినకుండా తూరుపునైపుగాబడివెళ్లాడు. సత్యం ఎక్కడకున్నాయి ?

సుశీ- ఎలక్షను ప్రచారంకోసం పల్లెలోకి వెళ్లాడు. (బయట ఉరుములు, మెరుపులు వినిపిస్తాయి.) వర్షం వచ్చేలా గుంది. అసలే చీకటి, ఒక్కడే వెళ్లాడు.

రాఘు- నేనూ వెళ్లొస్తాలేవుండు.

సుశీ- కాస్త వెళ్ళిరా బాబాయి. అసలే మారోజులు బాగా లేవు. ఈ పాడుఎలక్షను మాకోసమే వచ్చినట్లుంది. వారికి నిద్రాహారాలులేవు.

రాఘు- వాడు అట్లాచేస్తున్నాడుకాబట్టే యివ్వాళ ఆజగన్నాథంగాడికి ఒక్కఓటు పుట్టటంలేదు.

(మళ్ళీ శబ్దాలు వినుపిస్తాయి)

సుశీ- (కంగారుగా) త్వరగా వెళ్ళిరా బాబాయి.

రాఘు- వెళుతున్నాలే. (వెళ్లాడు. చంద్రం వచ్చాడు.)

సుశీ- ప్రొద్దుపోతుంది. భోంచేద్దుగాని లే అన్నయ్యా!

చంద్రం- నాకు ఆకలిగాలేదు సుశీ

సుశీ- ప్రొద్దునెప్పుడో అయినట్లు పోయినట్లుగా తిన్నావు. యిట్లా ఆరోగ్యంపాడు చేసుకుంటే ఎట్లాగన్నయ్యా!

చంద్రం- (నిట్టూర్చి) నన్న బాధపెట్టకు. నువెళ్ళి భోంచెయి. (యింతలో సత్యాన్ని చేతులమీదవేసుకొని రాఘవయ్యా, మరొకమనిషి తీసుకొస్తారు. సత్యం తలంతా రక్తప్రవాహంలో మునిగివుంది.)

సుశీ- బాబాయి. ఏమిటని ?

రాఘు- ముందు వీడిని పందుకోబెట్టనీయి. వరేయ్ చంద్రం ముందు డాక్టరుకోసం వెళ్ళిరా, వెళ్ళిరా త్వరగా!

చంద్రం- ఏమిటి. ఎవరుకొట్టారు బాబాయి ?

రాఘు- అది తరువాత చెపుతాను. నువ్వు ముందు వెళ్ళరా బాబూ?

సుశీ- (ఏడుస్తూ కూలబడుతుంది. చంద్రం బయటకు పరుగెత్తాడు.) ఏమిటిబాబాయి. ఎవరు చేశారీపని ?

రాఘు-అక్కడంతా మనరంగడే నంటున్నారు. అటువేపుకర్రతో పరుగెడుతున్నాడట ఎవరుచేసిందీ తెలియలా. (రంగారావు కర్రతో వచ్చాడు. ముఖం క్రోధంతో ఎర్రబడి వుంది. సుశీలకు క్రోధం, దుఃఖం రెండూవచ్చినై. రివ్వున లేచింది.)

సుశీ- (ఏడుస్తూ) ఏమిటన్నయ్యా యిది చిన్నప్పుడు నన్ను నీచేతులతో ఎత్తికొనిపెంచావే! నీకు మేముచేసిన అపకారం ఏమిటి? నాపసుపూ, కుంకం నీచేతులతోనే తుడిచేస్తావా! నీకంత కోపంగావుంటే నన్ను చంపలేకపోయావా?

రంగా- (ఆవేశంతో) సుశీ...

సుశీ- ఆమాటంటానికి నీకు నోరెలావచ్చింది. నా గడప త్రొక్కటానికి సిగ్గెలాలేకపోయింది. ఏదో పడిపంచల్లో తలదాచుకుంటున్న మమ్మల్ని యిలానాశనంచేస్తావా? నాన్నను చంపావు, పరువుమర్యాదల్ని పాడుపెట్టావు, యింకా నీకు దాహంతీరలేదు. నా యీ తాలిబొట్టు గూడా త్రెంచితేకాని నీకు నిద్రపట్టలేదా?

రంగా- (కర్ర క్రిందపడిపోయింది. కన్నీళ్ళలో ముఖం తడిసిపోయింది.) సుశీ నన్ను మీరుయిలాగే అపార్థం చేసుకున్నారు. నేనూ అలాగే అర్థంచేసుకున్నాను అందుకే యింతవరకూ నాశనమయ్యాం. కాని నేనెంతరాక్షసుడినైనా, నీమంగళసూత్రం త్రెంచలేదమ్మా!

సుశీ- ఛీ. యింకా సిగ్గులేక మాట్లాడుతున్నావా? పో! నా యింట్లోనుండి పో! (ఏడుస్తూకూలబడింది.)
(చంద్రం పరుగెత్తుకుంటూ వచ్చాడు. రంగారావును చూచి అదరిపడ్డాడు. రంగారావుతో ఏదో చెప్పబోయి చెప్పలేకపోయాడు.)

చంద్రం- బాబాయి. వీడిని పాపిష్టమ్మను పోలీసువాళ్ళు వస్తున్నారు. కామయ్యను చంపేసివచ్చాడు. త్వరగా వెళ్ళమను.

రాఘు- కామయ్యనా?

చంద్ర- ఔను.

సుశీ- ఎంతపని చేశావన్నయ్యా వెళ్ళిపో త్వరగా.
(అంతా ఆశ్చర్యపోతారు)

రంగా- అక్కర్లేదు. రానీయి బాబాయి. నేను అవివేకంతో చేసిన పనులకు ప్రాయశ్చిత్తం అనుభవించాలిసిందే. (కన్నీళ్లు కారుస్తాడు.)

చంద్రం- అవన్నీ తరువాత చూడొచ్చు త్వరగా వెళ్ళమను. బావనుకొట్టింది భీముడట. వాడిని పట్టుకున్నారు. కామయ్య చచ్చిపోయాడు. పట్టుకుంటే వురిశిక్ష వేస్తారు. వెళ్ళమను.

సుశీ- అన్నయ్యా! వెళ్ళన్నయ్యా! త్వరగా వెళ్ళిపో.

రాఘు- ఓరి పెద్దమ్మా! యింకా ఆలోచిస్తావేం వెళ్ళరా! చివరకు ఎంతకాడికి తెచ్చావురా! (బయట అంతా గోల. పోలీసుల విజిల్సు వినుపిస్తుంటాయి.)

రంగా- (రంగారావు దుఃఖం పొంగింది. ఆవేశంపట్టలేక) అన్నయ్యా! నన్ను క్షమించు. (కాళ్ళమీదపడ్డాడు)

చంద్రం- అదితరువాత చూచుకుందాం. లే. పారిపో. (లేవ దీస్తాడు) బాబాయి డాక్టరొస్తున్నాడు. [illegible]

కట్టించు, పదగా, పద. (చెయ్యిపట్టుకుని లాక్కు-వె
ళ్ళాడు దొడ్డిదారిని.)

సుశీ- బాబాయి. (అంటూ సుశీల పడిపోయింది.)

[ తెరలో పాట ]

ఎవరు ఏలినా, ఎవరు రాలినా
ఏమున్నది ఈ స్మశానంలో
క్రౌర్యం, కార్పణ్యం, దౌర్జన్యం
కలిగించిన మారణహోమం
గుండె గుండెకుమధ్య
ఘోషించు ద్వేషాలు
ఆరిపోయే దెన్నడన్నా
మన ఆత్మలకు శాంతిలేదన్నా.

[ తెర ]





ముద్రాపకులు : "రవి ప్రింటర్స్," తెనాలి.



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA129B160 |
| పుస్తకం పేరు | రైతు బిడ్డలు |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 111 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Sowmya |
| పేజీలు విడదీసినది | Sowmya |
| స్కాన్ చేసినది | Sravanthi |
| పరీక్ష చేసినది | sandhya |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |